ఏబది నాల్గవ పూజాపుష్పము



# ఆనంద గ్రంథి

(వ ల పు ము డి)

## లలిత గీతాలు







దుర్గా ప్రసాద్

ప్రథమ ముద్రణము

500 ప్రతులు



ప్రమాధినామ సంవత్సరము
శరదృతువు - కార్తీకము
1999 - నవంబరు

వెల రు. 20-00

ముద్రణము :
దుర్గాభవాని ప్రింటర్సు - విజయవాడ–3

---

ప్రతులకు :
**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
విజ్ఞాన భవన్, బ్యాంకు-స్ట్రీట్
హైదరాబాదు–500 001.
అన్ని బ్రాంచీలలో లభ్యమగును
**పి. దుర్గారావు M. O. L. తెలుగు పండిట్**
అడవిదేవులపల్లి, P. O. 507 208.
(వయా) మిర్యాలగూడ, నల్లగొండ జిల్లా.

# వినయ వాక్యము

'ఆనందగ్రంథి' అను ఈ లలిత గీతాల పుస్తకమును నలుబది నాల్గవ పూజా పుష్పముగా తెలుగు సాహితీ సరస్వతీ శ్రీ చరణార వింద ములకు భక్తి పూర్వకముగా సమర్పించు కొనుచున్నాను

ఉపాధ్యాయ వృత్తి నిర్వహించుకొనునప్పుడు అప్పుడప్పుడు వ్రాసి కొనినవి యీ గీతములు. మధుర భక్తిని మనోహరముగా వ్రాసికొనిన మహా భక్తురాలు మీరాబాయి, భక్త కబీరుదాస్, మహా వైష్ణవ భక్తురాలు శ్రీ ఆండాళు దేవి, కీ. శే శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిగారి మధుర గీతములు నా యీ లలిత గీతములకు ప్రేరణయని చెప్పవచ్చును.

శ్రీకృష్ణుని నాయకునిగా జేసికొని మధుర భక్తితో రచించిన ఈ పుస్తకమును శ్రీ కృష్ణుని చరణార విందములకే సమర్పణ గావించు కొనుచున్నాను—

ఇందు నాయకునిగా వర్ణింపబడిన శ్రీ కృష్ణుడు మురళీ లోలుడేగాక పరబ్రహ్మ స్వరూపముగను, ఇందలి గోపికా విరహము పరమేశ్వరుని యందు లీనమగుటకు వేదనా పూర్వకమైన జీవి ప్రార్థనగా భావింపవలెను.

ఇదివఱలో ప్రచురించిన లలితగీతములను ప్రశంసించుచు పత్రికలు, ప్రముఖులు వ్రాసియున్నారు. వారికి నా నమస్సుమాంజలులు. ఇదే విధముగా మఱికొన్ని పుస్తకములు ప్రచురింపవలెనని నా ఆకాంక్ష.

ఈ పుస్తకమునందుగల 118 గీతములు సాధ్యమైంతవఱకు పాడుకొనుటకు వీలుగా లలిత పదములతో గుది గ్రుచ్చబడినవి. ఆకాశవాణి, దూరదర్శినులలో పాడుకొనుటకు వీలుగా సమకూర్చబడినవి. రసహృదయులను ఏ మాత్రము స్పందింపజేసినను ధన్యునిగా భావించుకొందును.

—రచయిత



# మాతృ వందనము

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందన మిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!

సకలసస్య శ్రీనిలయిని! సాధుమార్గ శుభదాయిని!
సర్వలోక జనపూజిత! సామగాన సురభాషిణి!
సకలధర్మ సహజీవన సంస్కృతి విలసిత శోభిని!
పుణ్యకర్మ సువిరాజిత పూర్ణకలా తేజోమయి!

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి వందనమిదె! ప్రియభారతి!

గంగ యమున గోదావరి కావేరీ కృష్ణవేణి!
ఉన్నత హిమ గిరి శిఖరము లొప్పెడు శుభ కల్యాణి!
అడుగడుగున పుణ్యభూము లమరు విమల సౌమ్యమూర్తి!
మధుర కావ్య గేయ శిల్ప మంజులతర శివగాయని!

ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె! ప్రియభారతి!

సత్యము శివ సుందరములు సర్వదిశలు విలసిల్లిన
ఈ సుందర కర్మభూమి! ఈ పవిత్ర దివ్యధాత్రి!
నీ స్వరూప విలసనమే! నీ యనంత దర్శనమే!
అమ్మా! నీ యాశీస్సులు నలరి వేడుచుంటి నమ్మ!

ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి ఓహో! నా మాతృభూమి!



# సమర్పణ

ఎన్ని మారులు పాడినా
వన్నె దరుగదు నీ పాటకు!

ఎన్ని మారులు విన్నా నీ మురళీ స్వనాలకు
వన్నె లేమీ తరుగవు గదా!

మఱచి పోవాలన్నా మాధవా!
మఱపురాదు నీ పేరు!

విడిచి పోవాలన్న వీడిపోదు
విడివడని బంధ మిది యేనాటిదో!

తీయని నీ మురళి పాట
తీపిదనం కురిపిస్తుం దెప్పుడూ!

నర్తన జేస్తుం దెప్పుడూ నా యెదలో
సవ్య సుందరములను వెలువరిస్తూ!

అందుకే అర్పిస్తున్నా
ఆత్మార్పణమని!

ఆవేదనతో నా మధుర గీతాలను!
యుగయుగాల నాటి నీ మధుర గీరాలు!
తరతరాల నాటి దీ హృదయా వేదన!

# ఆనంద గ్రంథి
## (వలపు ముడి)
### (లలిత గీతాలు)

**ఎందుకో నా మనసు!**

ఎందుకో నా మనసు నెల్లవేళలయందు
నిను జూడగోరునూ! నిను బాడునో కృష్ణ!

లలిత గీతములందు లాలిత్యమొలుకుచూ!
నిండారు ప్రేమనూ! నీపైని నిలుపునూ!

ఎందుకో! నామనసు నెల్లవేళలయందు
నిను జూడ గోరునూ! నిను బాడునో కృష్ణ!

కంటికగుపడని నీ కరుణా స్వరూపమును
కలలందు నిజమనుచు గలవరించుచు నుండు!
మోహనంబయిన నీ మురళీ స్వనంబులను
వినినటులె తనలోనె విమలతను స్పందించు! ॥ఎందుకో॥

పతి వనుచు నిను దలచి భక్తితో బూజించు
మాధుర్య మొలికించు మధురగీతము లోని!
ఈ బంధమెట్టిదో! యెటనుండి వచ్చెనో!
అంతుదొరుకదు దాని యర్థమే తెలియదూ! ॥ఎందుకో॥

జన్మ జన్మలనాటి సహచర్య మగునేమొ!
తొలిపుట్టుకల నాటి కల పరిచయము లేమొ!
బంధించినది యిటుల బలుకుమా శ్రీకృష్ణ!
కంటి కగుపడి నాదు కలత నలతను బాపు!

ఎందుకో! నా మనసు నెల్ల వేళలయందు
నిను జూడగోరునూ! నిను బాడునో కృష్ణ!

## విధి వ్రాసినా వ్రాత!

విధి వ్రాసినా వ్రాత విమలమగు తలవ్రాత!
నన్ను నీకర్పించె నాల్గు మోముల ధాత!

అరసి జూడుము కృష్ణ! యందాల నగుమోము!
మధురాక్షరములనూ మమతతో బరికింపు!

విధి వ్రాసినా వ్రాత విమలమగు తలవ్రాత!
నన్ను నీ కర్పించె నాల్గు మోముల ధాత!

జన్మజన్మల నాదు చైతన్యమును గాంచి
మరువనీ నీ భక్తి మాధుర్యమును జూచి!
నను మెచ్చి నీకిచ్చె నాథ నీ దాసిగా!
నీ నీడలో నుందు నిండుదయ జూపుమా! విధి॥

వనమాల జేబూని వన్నెలను నొలుకుమూ
ఎదురు జూచుచు నుంటి సదయ నీ రాక కయి!
పల్లకీలో నన్ను భద్రముగ గొనిపొమ్ము
ఎవరు లేనీ నీదు ఏకాంత మందిరము! విధి

నినుజూడ సిగ్గగును నిజముగా గోపాల!
మాటాడజాలనూ! మనసిచ్చి తనివార!
చిటివ్రేలి జేపట్టి ఓన్నారి నడకలతో
సప్తపదులను వేసి సరిగమల జేర్చుమూ!

విధి వ్రాసినా వ్రాత! విమలమగు తలవ్రాత!
నన్ను నీకర్పించె! నాల్గుమోముల ధాత!

## నిజమేమొ! కలయేమొ!

నిజమేమొ! కలయేమొ! నిజము దెలుపగలేను!
మధుర గోపికనైతి మాధవా! యీ రాత్రి!

నీతోని జతగూడి నీలి యాకాశాన!
విహరించి నట్లుగా వేడుకలు గలిగినవి!

నిజమేమొ! కలయేమొ! నిజము తెలుపగ లేను!
మధుర గోపిక నైతి మాధవా! యీరాత్రి!

మురళి మ్రోయింపగా మోదమున నిను గూడి
పాట పాడినయటుల బంగారు గజ్జియల
నే నాట్య మాడినటు నింగి చుక్కల నడుమ
నిన్ను నన్నూ జూచి నిలిచినటు దేవతలు! ॥నిజ॥

వెన్నెలా జాబిల్లి వన్నెలను జిందగా!
వెండితీవెల నడుమ వేడుకను నిరువురము
దోబూచు లాడినటు దూర దూరమునుండి
చిన్నచుక్కలు గూడ చిత్రముగ చూచినటు! ॥నిజ॥

ఎట్టి సంబంధమో యెఱుగ నే గోపాల!
మన బంధ మిట్టిదని మనవి చేయగలేను!
విధిచైదమున మనము వేఱుగా నుంటిమీ!
కలియుదుము నొకనాడు కలగాదు! ఇది నిజము!

నిజమేమొ కలయేమొ! నిజము దెలుపగలేను!
మధుర గోపిక నైతి! మాధవా! యీరాత్రి!

## మురళి మ్రోయించేటి!

మురళి మ్రోయించేటి మోహనాంగుని జేరి
పాట నే వినుచుంటి పారవశ్యముతోని!

ఆనంద సుధలలో నలరిదేలుచునుంటి!
నను బిలువబోకుడో! నా నర్మ చెలులార!

మురళి మ్రోయించేటి మోహనాంగుని జేరి
పాట నే వినుచుంటి పారవశ్యముతోని!

మావి గున్నలమధ్య మాలతీ లతలందు
నిలిచినా కృష్ణునీ నీడలందున నిలిచి!
కనులార్పకను జూచి కమ్మనీ స్వనములను
చెవులార వినుచుంటి చిత్తమేకము జేసి! ॥మురళి॥

ఏనాటి పుణ్యమో! యేనోము భాగ్యమో!
చిన్నికృష్ణుని మురళి జేరి నే వినుచుంటి!
అమృతంపు సోనలను నలరి మునిగితినమ్మ!
దరి జేర్పకుడు నన్ను దయదలచి నాచెలులు! ॥మురళి॥

మధుర మురళీ తెరల మాధురిని దేలుచూ
మునిగి తేలుచునున్న ముదిత నో చెలులార!
ఏకాగ్రతను జెఱపి ఇటులాగి యటులాగి
నా ప్రాణనాథునీ నను వేఱు బరుపకుడు!

మురళి మ్రోయించేటి మోహనాంగుని జేరి
పాట నే వినుచుంటి పారవశ్యముతోని!

## నీ నామమును దలప!

నీ నామమును దలప నిరతిశయ సుఖముచే
ఆనందలోకాల నటు దేలిపోవుదును:

నీరూపమును మనను నిర్మలంబుగ దలప!
వశము దప్పుదును నీ వలలందు బడిపోదు!

నీనామమును దలప నిరతిశయ సుఖముచే
ఆనందలోకాల నటు దేలిపోవుదును!

అందాల మురళి నీ వలరి పాడినయటుల
మనసు భ్రమలను జెంది మాధుర్య మొలకించు
దిక్కులన్ని జూతు దిశలన్ని బరికింతు!
యానంద వాహినిని యటు దేలిపోవుదును

కిన్నెరను జేపట్టి కీర్తనను నే బాడ
నీ పాటలే వచ్చు నిలువకను కంఠమున!
కోకిలకువలె నేను గొంతెత్తి బాడుదును!
వీధి వాడల జనులు వింతగా ననుజూడ!

బందీగజేసితివి! బానిసగ జేసితివి!
నీ ప్రేమ మాధురివి నిలవజాలను కృష్ణ!
ఆనంద వాహినిని యడ్డుకొన జాలనోయ్!
నీనామమును దలచి! నిలువజాలను కృష్ణ!

నామమున యేముందొ! నవ్యసుందర రుచులు!
మురళిలో యేముందొ! మోహనంబగు మాయ!
రూపమున యేముందొ! రూఢి తెలుపగలేను!
శాపమో! పాపమో! తాప మిటు లెందుకో!

## వాన చినుకుల్లార!

వానచినుకుల్లార! ఒకటొకటి చిలుకుచూ!
బరువయిన నా మనసు బాధింపకండమ్మ!

పతి విరహ వేదనను బహువరించెడి నన్ను
మనసులో మంటలను మండింపకండమ్మ!

వానచినుకుల్లార! ఒకటొకటి చిలుకుచూ!
బరువయిన నా మనసు బాధింపకండమ్మ!

ఏ మబ్బులో నుండొ! యే మెఱుపులో నుండొ!
నా ముందు సరసతను నాట్యాలు జేసెదరు!
కృష్ణవిరహము చేత కుమిలిపోయే నన్ను!
అగ్గి రవ్వలకువలె నలత జేయకుడమ్మ! ॥వాన॥

చల్లనీ మీతాకు మెల్లనీ మీసోకు
వడ గాల్పులకువోలె వధ జేయుచున్నదీ!
చిగురాకులా పైని చిత్రముగ నిలిచి నా
కంటిలో సూదులను కసిదీర గ్రుచ్చకుడు! ॥వాన॥

ఈ వాన కాలాన యీ మబ్బు లోకాన
యెటుల జీవింతునో! యీ విరహ జ్వాలలను!
మాధవుని బిలిచినా మధురవ్యథ దీర్చుడో!
చిన్ని చినుకుల్లార! చిరదాసి మీ కవుదు!

వానచినుకుల్లార! ఒకటొకటి చిలుకుచూ!
బరువయిన నా మనసు బాధింపకండమ్మ!

## ఎంత కాలమున

ఎంతకాలమున కీ వెన్నెలలు వికసించె!
వింతగా చంద్రుడూ వినువీధి కనిపించె!

మబ్బులన్నీ చెదిరి మఱి పాల నురుగులయి
తెల్లపీ కాంతులను పల్లవించెను జగతి!

ఎంతకాలమున కీ వెన్నెలలు వికసించె!
వింతగా చంద్రుడూ వినువీధి కనిపించె!

దండ తెగి ముత్యాలు ధరనంత బఱచినటు
అందమయి యాకసము నగుపించె జుక్కలను!
కలువ తామరలతో కలహంస గుంపులును
అగుపించె కొలను లవె అందాలు విరబూసి! ॥ఎంత॥

వనవీధి యంతయును వన్నె చిన్నెల పూలు
పులకరించుచునుండె పుడమిపయి జారుచును!
చిలుక గోరింకలును చిత్రమగు పలుకులను!
కోకిలకు పాటలను గూర్చినటు లనిపించె! ॥ఎంత॥

వెన్నెలలు కురిసేటి విమల కాలమునందు
తామరలు పూసేటి తరుణ ఋతువందునా
వత్తునని కబురంపె వల్లభుడు రాడేమి?
ఎదురు జూచుచునుంటి మదినిండు కన్నులను!

ఎంతకాలమున కీ వెన్నెలలు వికసించె
వింతగా చంద్రుడూ వినువీధి కనిపించె !

## ఆర్షనేత్రము

ఆర్షనేత్రము నాకు సమర యెటులుండునో
అంత జూతునుగదా! యరమరిక లేకుండ!

కలత జేసేది యా కల్యాణ ధామునీ!
కథనంత జూతుగద! కమనీయ నేత్రముల!

ఆర్షనేత్రము నాకు నమర యెటులుండునో!
అంతజూతునుగదా! యరమరిక లేకుండ!

రాసక్రీడల నాటి రమణీయ దృశ్యములు
ఆలమందల నడుమ యాడినా పోకడలు!
మోహనంబయిన యా మురళి నూదుచు జగతి
పరవశముజేసినా పతిత పావను రూపు! ॥ఆర్ష॥

తీయనీ మాటలను తేనెలూరగ జేసి
వత్తునని కబురంపి వల్లభుడు రాడాయె!
ఎటు బోయెనో యేమొ! యెవరి కాపాడగా
అంతజూతును గదా! వింత కనులుండగా! ॥ఆర్ష॥

ముందు ఏమగుదునో ముగ్ధనగు గోపికను!
వరియించునా నన్ను? వన్నెలా మురళితో
నన్నొక్క గీతికకు నాదముగ గ్రహియించి
కడదేర్చునా కరుణ! కమ్మనీ యెద జేర్చి

ఆర్షనేత్రము నాకు నమర యెటులుండునో!
అంతజూతును గదా! యరమరిక లేకుండ!

ఆకాశమార్గాన యటుబోవు కిన్నెరలు!
నిలిచి నిముసము నాదు పలుకు వినుడమ్మా!

విరహకాంతను నాదు వేదనను వాపతికి
అందజేసి నన్ను ఆదరము జేయుడో!

ఆకాశమార్గాన యటుబోవు కిన్నెరలు
నిలిచి నిముసము నాదు పలుకు వినుదమ్మా!

దూరదేశాన నా విభుడుండె! నా పతికి
ఆర్తనగు నావార్త నందజేయుడు. వేగ!
పలవరించుచునుంటి పతిత పావనునికై
కలత బొందుచునుంటి కనులార దర్శింప! ॥ఆకాశ॥

నల్లనల్లని వాడు! నగుమోము గలవాడు!
నెమిలి పింఛమువాడు! నిండు దయగలవాడు!
మురళితో లోకాలు మోహింపజేసేటి
సృజన లయ స్థితికర్త! సుందరాంగుడు వాడు! ॥ఆకాశ॥

నా వేదనంతటిని నయముగా వ్రాసితిని
గీతిగా సుకుమార గీర్వాణ లిపియందు!
పాట వినిపింపుడో! పతికి మది దయ గలుగ
కిన్నెరను మీటుచూ కిన్నెరాంగనలార!

ఆకాశమార్గాన యటుబోవు కిన్నెరలు!
నిలిచి నిముసము నాదు పలుకు వినుడో కదుణ!

## చల్లనీ వెన్నెలా

చల్లనీ వెన్నెలా పువ్వులొలికించేటి
మెల్లగా బోయేటి వన్నె జాబిల్లీ!

పతికి నా కథ దెలిపి ప్రభుని రప్పింపవా!
నిండు దోసిలితోని నీరాజనము విత్తు!

చల్లనీ వెన్నెలా పువ్వు లొలికించేటి
మెల్లగా బొయేటి వన్నెజాబిల్లీ

వ్రతములను జేసితిని పతిభక్తి యెన్నెన్నొ
జపతపములను జేసి చలియించిపోతినీ!
ఆతని దయ రాదాయె! యలసితిని జాబిల్లి
విభునితొ నావార్త వినిపింపు నీవయిన! ॥చల్లనీ॥

చిలక గోరింకలను చెన్నుగా బంపితిని!
హంసలను బంపితిని యటుపైని కోకిలల!
వార్తలేమైనవో వల్లభుడు రాడాయె!
లేఖలేమైనవో లేదుగద శుభవార్త! ॥చల్లనీ॥

కాటుకను కన్నీట కలిపివ్రాసితి నిదిగొ!
హృదయ ఫలకమునందు మృదువాక్య మధురిమల
అందింపు ప్రియవార్త అందాల మాధవుకు
మందార వనమందు మదుర వెన్నెలయందు!

చల్లనీ వెన్నెలా పువ్వు లొలికించేటి
మెల్లగా బోయేటి వన్నె జాబిల్లీ!

## మింట చరియించేటి

మింట చరియించేటి జంట పావురములూ!
ఒక మంచి పనిజేసి యొనర పున్నెము గొనుడు!

ఈలేఖ నందించి వరకపోతములార!
చిరకీర్తి హొందుడో వరకపోతములార!

మింట చరియించేటి జంట పావురములూ!
ఒకమంచి పనిజేసి యొనర పున్నెము గొనుడు!

మేఘములు దాటుచూ మెఱయు జుక్కలదాటి
యటనుండు నావిభుడు నాకసము నందునా!
లేఖనందింపుచూ నేర్పుతో నాతనికి
'ప్రియదాని' యంపె నని ప్రేమతో దెలుపుడూ ॥మింట॥

నీనామమును దలచి నీరూపమును దలచి
యలసి పోయినదనుచు నాదరింపగ దెలిపి!
చిగురింప ప్రేమలను చిత్తమున కరుణతో
దయజూడ దెలుపుడో ధన్య దంపతులార! ॥మింట॥

మాలిన్యములు లేని మమతతో వ్రాసినది!
కోరికలు గిరికలు కొసరులవి లేనివీ!
ముత్యాలసరితోని ముడివేసి రెక్కలకు
జతగూర్చితిని వేగ జాగుసేయక జనుడు!

మింట చరియించేటి జంట పావురములూ!
ఒకమంచి పనిచేసి యొనర పున్నెము గొనుడు!

## ఈ లోకమందు

ఈ లోకమందు నే నెన్నెన్ని బాధలను
భంగపడినా కృష్ణ! భరియింపగలనూ!

నీ వేఱుబాటు నే నెటుల సహియించెదను!
నిజమయిన బంధమును నెట్లుద్రోతు దూరముగ?

ఈలోకమందు నే నెన్నెన్ని బాధలను
భంగపడినా కృష్ణ భరియింప గలనూ!

కటిక చీకటియందు కాఱునలుపుల యందు
అగ్గిమంటలలోన యలల పెన్నిధిలోన!
చరియింతుగాని నీచరణ కమలములనూ!
విలయ మొచ్చినగాని విడిచి యుండగజాల! ॥ఈలోక॥

వెలివేసినా గాని విధి చైదమునను నే
బంధు మిత్రములకూ బహుదూరమున నున్న!
ఆశలన్నీ యుడిగి యణగారిపోయినా
నిను నమ్మియుందు నే నిరతమును గోపాల! ॥ఈలోక॥

కన్నీరు వరదలయి కాల్వలై పారినా!
చింతలను నామనసు చివికిపోయినగూడ!
నాహృదిని నున్న నీ నవ్యసుందరమయిన
దివ్యరూపము నెపుడు బదిలముగ రక్షింతు!

ఈలోకమందు నే నెన్నెన్ని బాధలను
భంగపడినా కృష్ణ! భరియింపగలనూ!

## అతిలోక సుందరం బగు

అతిలోక సుందరం బగు వనితకాదు నా
వలపుతేనియ పాట! వందనం బిదె కృష్ణ!

తలనెత్తి నీరూపు తన్మయముగా జూచి
పలికి పాడగలేని పడతి గద గోపాల!

అతిలోకసుందరం బగు వనిత కాదు! నా
వలపు తేనియపాట వందనం బిదెకృష్ణ!

పలుకు పాటలలోన పన్నీటి జాలులను
మైమఱపు జేసేటి మగువకా దీ బాల!
తేటగీతిక వోలె తీయగ బాడుచూ!
కర్పూరహారతిగ కరిగిపోయెడి కాంత! ॥అతిలోక॥

కోరికలతో నిన్ను కొసరి కొసరీ పలికి
ఆశలను బెంచుకొను అతివ కా దీబాల!
ఆత్మార్పణంబుతో నంత నీ కర్పించి
నీయంచు అయమందు నిర్మలంబగు బాల! ॥అతిలోక॥

గొల్లపడుచిది సుమా! గోల యని మది దలచి
దూరముగ నుండకుము దురపిల్ల జేయకుము!
అతిలోక కల్పనల యాశలందున మునిగి
నా గోపికా గీతి నగుబాటు సేయకుము!

అతిలోక సుందరంబగు వనిత కాదు నా
వలపు తేనియపాట వందనం బిదె కృష్ణ!

## పెంచినా హరిణమును

పెంచినా హరిణమును పెను క్రూర జంతువున
కర్పించి యిటులుండ నది తగున కృష్ణా!

పంజరంబున బెంచి పక్షి నిటు దూరమున
వదిలివేయుట తగున? మది రగుల వేదనను!

పెంచినా హరిణమును పెను క్రూర జంతువున
కర్పించి యిటులుండ నది తగున కృష్ణా!

ప్రేమతో తనువంత ప్రీతిగా దువ్వితివి
గరికపువ్వులు దెచ్చి కరుణతో మేపితివి!
మమత మానీ యిటుల మాధుర్యమును ద్రోసి!
పులుల కాననమందు పూర్ణ! ద్రోసితివిగా! ॥ పెంచినా॥

పలుకులను నేర్పి నను పలుభాషలను నేర్పి
రాజిలుక నని నన్ను రాణిగా జూచితివి!
పంజరములో నుండి పారద్రోలితివి నను
ఏ కొమ్మ రెమ్మలను నెటుల జీవింతునూ?

బ్రతుకు తెలియని నేను బ్రతుకెటుల బ్రతుకుదును?
కుటిల లోకమునందు గులుకుదును యాశతో?
ముందు కడుగిడజాల ముదముతో శ్రీకృష్ణ!
తొలినాటి దయజూపు! తొంగి చూడుము నన్ను!

పెంచినా హరిణమును పెను క్రూరజంతువున
కర్పించి యిటులుండ నది తగున శ్రీకృష్ణ!

## గిరులు గీసితి వంచు

గిరులు గీసితి వనుచు గీతలో నుండకను
ఎగిరివచ్చితి నిటుల నెగసి వేడుకనూ!

ఆటుదిరిగి యిటుదిరిగి అంతటను యెగురుచూ
నా బంధములు నేనె నాధ! కొని తెచ్చితిని!

గిరులు గీసితి వనుచు గీతలో నుండకను
ఎగిరివచ్చితి నిటుల నెగసి వేడుకనూ!

కొండ కోనలలోన కోకిలల జతగూడి
ఆడిపాడితి నెన్నొ యందాల క్రీడలను!
తరులందు నేజేరి తన్మయముగా దీపి
ఫలరుచుల నందిత్తిని! పరుగులే తీసితిని! ॥గిరులు॥

వెండి కొండలయందు బంగారు బాటలను
శృంగార వీధులను శ్రుతిలయల గలిపితిని!
సెలయేటి యూటలను జలదరించుచు ద్రావి!
మసక సంజల జూచి మది మురిసిపోతినీ! ॥గిరులు॥

శృంగార మంత నా బంగారు కలయేమొ!
వంగాెె తనువంత! సింగారములు వోయె!
మనసంత బరువాయె! మాధవుడు తలపొచ్చె!
ఎవరి దీ తప్పనగ వివరింప లేనాయె!

గిరులు గీసితి వనుచు గీతలో నుండకను
ఎగిరివచ్చితి నిటుల నెగసి వేడుకనూ!

## అతిలోక సుంద రిది!

అందాల తరిణ! నా అతిలోక సుంద రిది!
సుకుమార గీతి యిది! సుందరంబగు కాంత!

మనసార గ్రహియించి మన్ననను సేయుమా!
మదిలోన నిను గోరి మరుగుచున్నవి జ్వాల!

అందాల తరిణ! నా అతిలోక సుందరిది!
సుకుమార గీతి యిది! సుందరంబగు కాంత!

చంద్రకాంతుల వంటి చారు కోమల ఛాయ!
కలువకన్నుల రాణి! చెలువ తామర మొగము!
దివినుండి భువిదిగిన దేవకాంతకు వోలె
అపురూప కాంతులను నంతటా విరజిమ్ము! ॥అతిలోక॥

నీ మురళి స్వనములకు నీటుగా మదిపొంగి
అందాల గీతికను నలరి నేర్చినదోయి!
నిను వలచి నీ ప్రేమ వలలందు జిక్కినది!
దరిని జేర్పుము! లేద తగ నీట ముంపుమా! ॥అతిలోక॥

ఎన్ని జన్మలకైన నిన్నె బొందెద నంచు
వన్నెలన్నియు దాచి వనకన్యకను బోలె!
చీని చీనాంబరపు సింగారములు మాని
తపము జేయుచునున్న తన్వి యిది గోపాల!

అందాల తరిణ! నా అతిలోక సుంద రిది!
సుకుమార గీతియిది! సుందరంబగు కాంత!

## చంద్ర కిరణములార!

చంద్ర కిరణములార! చల్లనీ కాంతులను!
పైని బడబోకుడీ! భరియింపజాలా!

కృష్ణ విరహముజేత కుమిలేటి కాంతనూ!
వాడి శూలములచే వధియింపకుడు నన్ను!

చంద్రకిరణములార చల్లనీ కాంతులను!
పైని బడబోకుడీ! భరియింపజాలా!

మధుర గీతముబాడి మాధవుని దయగోరు
గోపకాంతను నేను కోమలాంగిని సుమా!
మీకాంతి సూదులను మిలమిలల గ్రుచ్చుచూ
నన్ను మధియింపకుడు నలిగిపోవుచు నుంటి! ॥చంద్ర॥

అంబరంబున నుండి యతిలోక సుకుమార
పూ బాణములు వేసి పులకింప జేయకుడు!
రక్త చందనముతో రగిలింప జేయకుడు!
నే బొందుదును గతిని నిజముగా వినుడమ్మ! ॥చంద్ర॥

పండుటాకులను తిని పార్వతీ దేవివలె
తపము నేయుచునుండి తగ నన్ని త్యజియించి!
శపియింతు శాపమున చంద్రకిరణములార!
నల్లనీ మబ్బులను నలిగిపొండని మిమ్ము!

చంద్ర కిరణములార! చల్లనీ కాంతులను!
పైని బడబోకుడీ! భరియింప జాలా!

## ఈ చల్ల గాలులను!

ఈ చల్లగాలులను ఈ శీత వీచికల
ఎటుబోదునే చెలియ! యెటు నిలుతునే!

క్రిష్ణ విరహముచేత కుమిలేటి నామనసు
వేడిగాల్పులకు వలె వెతజెంది విరహమున!

ఈ చల్లగాలులను! ఈశీతవీచికల
ఎటుబోదునే చెలియ! యెటు నిలుతునే?

చెలి వీణవాయింప జేత కిన్నెరదాల్చి
నే పాట పాడగా నిఖిలమంతా మఱచి!
ఎటనుండి వచ్చెనో యీశీత వీచికలు!
పాట నోటను రాక పరవశంబై పోతి! ॥ఈ చల్ల॥

వనవీధి గుడిజేరి వలనొప్ప మాధవుని
విమల గీతముతోని విరులతో బూజింప!
పూపొదలనుండి వే పొలుపుగా దరిజేరి
విరహవేదనలతో వేధించి నను ముంచు! ॥ఈ చల్ల॥

వ్రతభంగమునుజేయ వగలాడి వీచికలు
ప్రతిన జేసినవి నా పలుకు గీతిని నాప!
ఆటంకములు తొలగి హరిని నే గలియగా!
గంగలో కాశిలో కలియుదని శపియింతు!

ఈ చల్లగాలులను ఈశీత వీచికల!
ఎటుబోదునే చెలియ! యెటు నిలుతునే!

## నంద గోపాలునీ!

నందగోపాలునీ నాథుగా వరియించి
తీయనీ యూహలను తేలేటి నన్నూ!

పిచ్చిదాన నటంచు పిలిచి హేళనజేసి
నను రవ్వ జేయకుడు నాకూర్మి చెలులార!

నందగోపాలునీ నాథుగా వరియించి
తీయనీ యూహలను తేలేటి నన్నూ!

విమలగీతముతోని వీధులన్నీ దిరిగి
యా మురళిలోలునీ యలసి వెదుకుచునుంటి
కనిపించు నొకనాడు కనులపండువు గాగ
వినిపించు మురళినీ విమల స్వరములతోని! ॥నంద॥

భ్రమజెంది నే నిట్టుల బలుకుచుంటి నటంచు
కలలోన నే నిటుల గలతబడు చుంటినని!
పలుమాటలాడి నను భ్రమలోన దింపకుడు
నిజములో నిజము నా నిర్మలంబగు ప్రేమ! ॥నంద॥

పాలబుగ్గలనాడె బాలగోపాలునీ
పతిగ వరియించితిని పడతులారా! వినుడు
కలలందు కనిపించి భ్రమలందు నను గూడి
ఆటలాడేవాడు అతడే! నావిభుడు!

నందగోపాలునీ నాథుగా వరియించి
తీయనీ యూహలను తేలేటి నన్నూ!

# ఆ మబ్బు! ఈ మబ్బు!

ఆ మబ్బు! ఈ మబ్బు! అతికినా రీతిగా!
మా ప్రేమ ఫలియించు మాధవునికీ నాకు!

నా ప్రేమ కుసుమమును నా మధుర గీతికను!
నిండారు మనసుతో సీటుగా గ్రహియించు!

ఆ మబ్బు! ఈ మబ్బు! అతికినా రీతిగా
మా ప్రేమ ఫలియించు మాధవునికి నాకు!

గంగ యమునా నదులు గలిసి ప్రవహించినటు
కృష్ణవేణీ మూసి హర్షమున గలిసినటు
భూమి యాకాశాలు పొలుపుగా కలిసినటు
మా ప్రేమ లటు కలియు మాధవునికీ నాకు! ॥ఆ మబ్బు॥

మావికొమ్మను జుట్టు మాధవీలత యటుల
నింగి యాకాశాన నిలుచు హరివిల్లు వలె
చంద్రకాంతులు సోక చలియించు కలువలా
నే నుందు మాధవుని నిండు హృదయమునందు ॥ఆ మబ్బు॥

జన్మజన్మలనాటి విరహమును జతగూర్చి
నా మధుర గీతికను నాథునకు వినిపింతు!
ఆత్మార్పణం బనుచు! నతనిలో లీనమై!
నాదమై మురళితో నటియింతు గీతిగా!

ఆ మబ్బు! ఈ మబ్బు! అతికినా రీతిగా
మా ప్రేమ ఫలియించు! మాధవునికి నాకు!

## నంద గోపాలునికి!

నందగోపాలునికి! నవకిశోరునికి నే
వధువునై పోయితిని! వల్లభుడు నా కతడు

జన్మజన్మల వెంట చరియింతు జంటగా!
విడిచి నేనుండనే వేయి యుగములకయిన

నందగోపాలునికి నవకిశోరునికి నే
వధువునయి పోయితివి! వల్లభుడు నా కతడు

కోటి రూప్యములిచ్చి కొనలేదు నే నతని
వెండి బంగారముల వెల నిచ్చి కొనలేదు!
॥ మురళీ స్వనంబులకు ముద్దుగా మోహించి
కట్టు బానిసనైతి గల నిజము దెలిపితిని!

కంటి కగుపింపడే కనిపించు మదిలోన
వినిపించు చుండు మది విమల నాదము లెపుడు!
॥ పులకింతు నే నెపుడు పూర్ణ హర్షముతోని
మాధవుడు నిలిచినటు మమత జూపిన యటుల! ॥నంద॥

మనసునందే నేను మాధవుని దరిశింతు!
ఆటపాటలతోని యలరింతు మాధవుని!
కోర్కెలేమీ లేని కోమలాంగిని నేను!
మాధవుని దాసినని మది పొంగనే చెలీ!

నంద గోపాలునికి నవకిశోరునికి నే
వధువునై పోయితిని వల్లభుడు నా కతడు

## అమృత వర్షము లేల ?

అమృత వర్షములేల? ఆనంద సుధలేల?
సకల దేవత లిచ్చు సౌఖ్యములు యేలా?

మురళిచేత ధరించి ముద్దుగా బాడేటి
బాలగోపాలు నే భక్తితో వాంఛింతు!

అమృతవర్షము లేల? ఆనంద సుధలేల?
సకల దేవత లిచ్చు సౌఖ్యములు యేలా?

సృష్టిలో లేనట్టి సుందరము అన్నియును
అతని మురళిని గలవు ఆనంద లోకములు!
నేబోదు నతనితో నిరతమును నీడనై
జన్మజన్మలు గూడ చిరదాస్యభావమున! ||అమృత||

కంటి కగుపడి నన్ను కరుణింపమన్ననూ
కరము శిరమున జేర్చి కాపాడకున్ననూ!
దూరమున నన్నుంచి దురపిల్ల జేసినా
మదిలోని మాధవుని మఱచియుండగ లేను! ||అమృత||

కొండంత కోరికలు కొసరి యాచింపనూ!
భువిలోని యందాలు దివిలోని సౌఖ్యాలు
చేజాచి యడుగనూ చింత నా దొకటియే!
మనసులో మాధవుడు మఱి నిలిచియుండగా!

అమృత వర్షములేల? ఆనంద సుధలేల?
సకల దేవతలిచ్చు సౌఖ్యములు యేల?

## లోకానికి దెలియకుండ

లోకానికి దెలియకుండ
లోల! నిన్ను దలచుచుంటి!

మనసు లోనె మనసులోనె
మాధవ! నే బాడుచుంటి!

లోకానికి దెలియకుండ
లోల నిన్ను దలచుచుంటి!

నీకు మాత్రమే తెలియును
నీలవర్ణ! నాదు వినతి!
వినతిలోని మధుర ప్రేమ!
వేయి గీతముల భావము! ॥లోకానికి॥

గొంతునెత్తి పాడక నా
కోమలమగు మధురగీతి!
హృదయమందె పాడుచుంటి
సదయ! కూడి శ్రుతిలయలను! ॥లోకానికి॥

నాట్యమాడుచుంటి నాలో
నర్తన శోభల జిందుచు!
రాసలీల శోభ మించి
రమ్య రాజనర్తకి వలె! ॥లోకానికి॥

ప్రేమభక్తి మార్గములో
ప్రియ! నీవే నాదు పతివి!
జేరగ నిను ఈ మార్గము
జేకొంటిని జగదీశా! ॥లోకానికి॥

## ఆనంద గ్రంథి యిది!

ఆనంద గ్రంథి యిది! అపురూప స్నేహమిది!
నీకు నాకును మధ్య నిలిచినా గీతి!

నీ మురళిలో నుండి నామనను బొందినా
పులకలే గీతిగా బొలుపారె కృష్ణా!

ఆనంద గ్రంథి యిది యపురూప స్నేహమిది!
నీకు నాకును మధ్య నిలిచినా గీతి!

విశ్వసౌందర్యమును వెలయించు నీ గీతి!
నాదమున నాదమయి నాట్యములు సలుపునూ!
మాటకందని యేవొ మధుర భావాలనూ
చిన్ని పెదవులతోని చిఱుసవ్వడులు జేయు! ॥ఆనంద॥

తారలను దిరుగాడు దగ చందమామతో
వెన్నెలా వర్షమున విహరించు నొంటరిగ!
చివురు పూవులతోని చిత్రముగ మాటాడు
కొండ కోనలలోని కోకిలల జతగూడు ॥ఆనంద॥

అద్వైత భావమును నాలపించును మదిని
అణువణువు నీవుగా నఖిలేశ భావించు!
నీ మురళి నాదాలె నాగీతి సరిగమలు
చరణ కమలములందు సరసతమ నిలువనీ!

ఆనంద గ్రంథి యిది! యపురూప స్నేహమిది!
నీకు నాకును మధ్య నిలిచినా గీతి!

## సందెలో నున్న యీ

సందెలోనున్న యీ సరసగీతిని జూచి
ఎవరనుచు బలుక నే నేమి తెలుపుదనూ!

మురళీ స్వరంబులకు ముద్దుగా విరిసినా
చిన్నారి గీతియని చిఱునవ్వు నవ్వేదరు!

సందెలోనున్న యీ సరస గీతిని జూచి
ఎవరనుచు బలుక నే నేమి తెలుపుదునూ!

లోకమున పనియేమి? లోకులేమన నేమి?
నీకు నాకును మధ్య నిలిచినా దీపమీది!
పగలురాత్రి మధ్య పల్లవించెడి సంజ
వెలుగులకు వలె నిలిచి వివరించు మన ప్రేమ ॥సందెలో॥

హంసభామను నడిగి యందియల గొనివచ్చి
చిన్నారి పాదముల జిత్రముగ గూర్చితిని!
చిలకమ్మ పలుకులను చిత్రముగ నేర్పినది!
కోకిలను జతగూడి కూర్మినేర్చెను పాట ॥సందెలో॥

ఇన్ని నేర్చిన నాదు చిన్నారి గీతికను!
నీకు జూపుచునుంటి నీ స్నేహ ఫలమంచు!
ఆనంద గ్రంధియని యలరి నామం బిడితి
చంకదింపను స్వామి! చంటిపాపను నెపుడు!

సందెలోనున్న యీ సరసగీతిని జూచి
ఎవరనుచు బలుక నే నేమి తెలుపుదునూ!

## నమ్మకున్నది జగము

నమ్మకున్నది జగము! నాథ! నే నేమందు?
అల్లరీ పాలయితి! అందాల కృష్ణా!

నిను మధురభక్తితో నీరాజనము లిచ్చు
నను జూచి దూరమున నగుచుండె జనమంత!

నమ్మకున్నది జగము! నాథ! నే నే మందు?
అల్లరీ పాలయితి! అందాల కృష్ణా!

నర్తనల కీర్తనల నాథ! యనుచును నిన్ను
సతి ననుచు నే బలుక సరసిజాక్షా వినుము!
పకపకా నవ్వుచును పరిహాసమును జేసి
మనసు భ్రమ యనుచు నను మఱి పిచ్చి పట్టెననె! ॥నమ్మ॥

వీధి వీధుల దిరిగి వాడవాడల నడిచి
కిన్నెరను నే బట్టి కీర్తనను నే బాడ!
సాధు సజ్జనులతో సాంగత్యమును జేయ
వలదంచు బలుకుదురు వారు వీరందఱును! ॥నమ్మ॥

జన్మ రాహిత్యమును జేకూర్చు మార్గమని
ఆత్మార్పణమునకు అనువైన దారియని
మధురభక్తిని గీతి మార్గమును జేబట్టి!
పయనించు నీదాసి పలుకు విను గోపాల!

నమ్మకున్నది జగము! నాథ! నే నేమందు?
అల్లరీ పాలయితి! అందాల కృష్ణా!

## ఇచ్చటనే!

ఇచ్చటనే! హా! యీ ప్రదేశమున
ఇచ్చటనే యీ బృందావనమున
ఈ యమునా నది తీరంలో!

చక్కని కృష్ణుడు గోప స్త్రీలతో
సరసత నాట్యము జేసినదీ!

ఇచ్చటనే! హా! యీ ప్రదేశమున
ఇచ్చటనే యీ బృందావనమున
ఈయమునా నది తీరంలో-

ఈ బృందావన మందారములను
ఈ మధువనమున మల్లె మాలతుల!
మాలను గ్రుచ్చి మధుసూదనునకు
మమతను వేసిన దిచ్చటనే! ॥ఇచ్చటనే॥

ఈ యమునా నది తీరము నందున
యావుల మేపుచు గోపాలురతో!
ఆటలాడి యిటు వచ్చిన కృష్ణుని
చిఱు చెమటలునూ దుడిచిన దిచటే! ॥ఇచ్చటనే॥

గోప వనితలను గోవిందుడు తన
మోహనమురళీ నూదిన దిచటే
నేనుగూడ నొక గోపకాంతనై
రాసక్రీడ నర్తన జేసినదీ! ॥ఇచ్చటనే॥

జన్మజన్మలా బంధ మిటులనే
జరుగవలయునని కోరిన దిచటే!
మురళీ స్వనముల జతగ జేసి నే
ముద్దుగ గీతిని బాడిన దిచటే! ॥ఇచ్చటనే॥

## పంపినా రా చిలుక!

పంపినా రా చిలుక పయనమై వచ్చినది
శుభవార్త దెచ్చినది సుందరంబయినా!

చక్కనీ కృష్ణుడూ వచ్చునని పలికినది
ఒక్కసారిగ నాదు మనసు చల్లగనయ్యె!

పంపినా రా చిలుక పయనమై వచ్చినది!
శుభవార్త దెచ్చినది సుందరంబయినా!

ఎక్కడో దూరముగ నున్న నా పతి జేరి
మక్కువగ నా వినతి నొక్కి చెప్పినదంట!
నిక్కముగ వచ్చునట నేడు రేపో యింక
చక్కనీ పలుకులను సఖియలారా! వినుడు! ॥పంపినా॥

మాధవుడు వచ్చునని మనసు పూవులు పూచె
దుఃఖములు వేదనలు దూర దూరము బోయె!
చుక్కలా మిలమిలలు సుందరంబులు వెలిసె
జాబిల్లి వెన్నెలా జాలులై ప్రవహించె ॥పంపినా॥

నందకిశోరుడూ నవనీత చోరుడూ!
మురళినీ మ్రోయించు ముద్దు మోము గలవాడు!
నను జూడ వచ్చునట! నా పుణ్య భాగ్యమున
జ్యోతిలో జ్యోతిగా ప్రీతితో నే నగుదు! ॥పంపినా॥

తెలియ జెప్పగరాని చైతన్యమది యేమొ!
అంతరాత్మను నిండె ఆత్మీయ స్నేహమున!
పాల సంద్రములోన పడి లేచు నావవలె
నా మనసు రాగాన నాట్యాలు చేస్తోంది! ॥పంపికా॥

## మల్లె మాలతులార!

మల్లె మాలతులార! మాధవీ లతలార!
చిలుక గోరింకలూ చిన్నారి పిచికలు!

కుశల ప్రశ్నలు వేయబోకండి!
కుమిలిపోవగ జేయబోకండి!

మల్లెమాలతులార! మాధవీ లతలార!
చిలుక గోరింకలూ! చిన్నారి పిచికలు!

పతి విరహమున నేను
పలు బాధ లందుచును!
కన్నీళ్ళలో మునిగి కడలి జేరెడి నన్ను! ॥మల్లె॥

జన్మ జన్మల నాటి
చరితమును దెలిపినా!
సతినంచు బలికినా పతినంచు బలుకడూ! ॥మల్లె॥

మధురిమలు చిందేటి
మధురాక్షరములతో!
లేఖలను బంపితిని! లీలగా రాడుగద! ॥మల్లె॥

కటుకు బంపముతోని
కాఠిన్యములు చింద!
కోయుచున్నట్లు నే కుందుచుంటిని చెలియ! ॥మల్లె॥

నా ప్రేమ వికసింప
నా వలపు ఫలియింప!
నాదు డొచ్చె దారి నలుగురూ గనుదమ్మ! ॥మల్లె॥

# మైత్రీ మహావ్రతము

మైత్రీ మహావ్రతము మన్ననను సేయుమా!
విడదీకు పరమాత్మ! వేయి జన్మలకయిన!

నీ మురళి స్వనములను నిలుచు నా గీతినీ!
అనుసరింపగనిమ్ము! ఆనంద మార్గమున!

మైత్రీ మహావ్రతము మన్ననను సేయుమా!
విడదీకు పరమాత్మ! వేయిజన్మల కయిన!

తొలిసంధ్య యరుణిమలు తోరణము నీ మురళి
మబ్బుతునకకు వోలె మసలనీ దాపునను!
నింబాడు నీకాంతి నీటుబను నాగీతి
బంగారు టంచులను భాసించు శోభలను! ॥మైత్రీ॥

సప్తస్వరములతోడి సంగీత మా మురళి
నా గీతి తారగా నాట్యమాటగనిమ్ము?
విశ్వ సౌందర్యమును వెలయించు నాదమున
వరుస గలుపగ నిమ్ము వన్నెలా పదములను! ॥మైత్రీ॥

నీ మధుర స్వనములను నిలిచిపోవగ కోర్కె!
నాదమున నాదమయి నాట్యమాడగ కోర్కె!
మైత్రి విడదీయకుము! మాధవా! యెన్నటికి!
జ్యోతిలో జ్యోతినై ప్రీతి కలిసేదాక!

మైత్రీ మహావ్రతము మన్ననను సేయుమా!
విడదీకు పరమాత్మ వేయిజన్మల కయిన!

# వచ్చి నాదరి జేరి

వచ్చి నా దరి జేరి వగదీర్తువని కదా!
నిలిపితిని ప్రాణములు నిఖిల లోకేశా!

పైపైకి రాకుండ పదిలముగ మౌనముగ
మదిలోన దాచితిని మంజులంబగు గీతి,

వచ్చి నాదరిజేరి వగదీర్తువని కదా!
నిలిపితిని ప్రాణములు నిఖిల లోకేశా!

సుందరంబగు నీదు సురుచిరంబగు మోము!
కన్నారగాంచగా కాద! నే నెన్నెన్ని!
వ్రతములను, నోములను వరుసతో జేసితిని
జపతపములను జేసి చలియించి పోతిని! ॥వచ్చి॥

కొండలెన్నో గడిచి కోనేరులను మునిగి
కిన్నెరను బట్టి నే కీర్తనను బాడితిని!
కనిపింపరావుకద కన్నులకు పండువుగ!
మురళి వినిపించి నను మోదమున దేల్పవూ ॥వచ్చి॥

జగతిలో కష్టాల చరిలో వేదనల
నిలిపితిని ప్రాణాలు నీ కోసమే గదా!
నా మౌనగీతమును నా వినతి కరుణతో
మురళిలో గలిపికొను ముద్దుమోమును జూపి!

వచ్చి నా దరిజేరి వగదీర్తువని కదా
నిలిపితిని ప్రాణములు! నిఖిల లోకేశా!

## అడుగడుగు నందునా!

అడుగడుగు నందునా యాత్మలో నిను దలచి
బ్రతుకుచున్నదిగదా! పరమాత్మ! యీ గీతి!

మోము జూపకు స్వామి మునుగు విరహమునందు
అగ్ని కుండమునందు నలమటించిన యటుల

అడుగడుగు నందునా యాత్మగా నిను దలచి
బ్రతుకుచున్నదిగదా! పరమాత్మ నా గీతి!

నీ మురళిలో గలియ సింతయిన మార్గమెదో!
నీ మధుర స్వనములను నిలిచి నాట్యము సేయ!
మార్గమేదో తెలుపు! మలుపు లేవో జూపు!
బాటసారికి వోలె పయనమై పోవునూ! ॥అడుగడుగు॥

చిలుక గోరింకలను జేరి స్నేహముతోని
మంజులంబుగ ముందు మాటాడుటను నేర్చి!
కోనలోనున్న యా కోకిలకు శిష్యయై
తీయగా పాటలను దిద్దుకొను మంగువా? ॥అడుగడుగు॥

వీణాది వాద్యములు వేల్పుకన్నెల జేరి
శుశ్రూషతో నేర్చి సురుచిరంబగుమనా?
ఎన్ని జెప్పిన గూడ నన్ని జేయును స్వామి!
నీ మోము జూడకను నిలువలే దీ గీతి!

అడుగడుగునందునా యాత్మలో నిను దలచి
బ్రతుకుచున్నదిగదా! పరమాత్మ! యీ గీతి!

## ప్రేమభక్తి మార్గము నే

ప్రేమ భక్తి మార్గము నే
ప్రియమారగ బోవుచుంటి!

దారి జూపవోయి కృష్ణ!
దయను చిలకరింపవోయి!

ప్రేమభక్తి మార్గము నే
ప్రియమారగ బోవుచుంటి

కాలుదవుల బయనించుచు
కన్నీటిని నొలుకుచుంటి!
అయినగూడ యీ దారిని
యలసిపోక పయనింతును! ॥ప్రేమభక్తి॥

నీదు మురళి ననుసరించి
నే పాటలు బాడుచుందు!
చితిలో నే గలియు వఱకు
చెదిరి యలం కలియుదాక! ॥ప్రేమభక్తి॥

నా కంటికి చుక్కానివి!
నా మనసుకు దెరచాపవు!
నా నావకు కర్ణధారి!
నాథ! నాకు గతివి! పతివి! ॥ప్రేమభక్తి॥

చెదరిపోదు నాదు మనసు
చెరిగిపోదు నాదు ప్రేమ!
ప్రేమ భక్తిమార్గము నే
పయనింపుదు! దారి జూపు! ॥ప్రేమభక్తి॥

# కన్నీటిని యాపలేను

కన్నీటిని యాపలేను!
కలత నలత నిలుపలేను!

కనిపింపుము గోపాలా!
కరుణ జూడు మురళీధర!

కన్నీటిని యాపలేను!
కలత నలత నిలుపలేను!

తలచి తలచి నీరూపము
తనువంతయు కృశియించెను!
ఏకవేణి తోని నిలిచి
రాక గోరుచుంటి కృష్ణ! ॥కన్నీటిని॥

వానకాల మబ్బుల వలె
వర్షించుచు కన్నీటిని!
తెలతెల్లని వెన్నెల వలె!
వెలువెల బోతిని తెల్లగ! ॥కన్నీటిని॥

అంబుధిలో నలకు వోలె
యదలుచుంటి నిను జేరగ!
పిలిచి పిలిచి నీ నామము
విలపించుట కాన లేవ! ॥కన్నీటిని॥

మాయలోని మాయకు వలె
మనసునేల దోచితివో!
పంజరమున చిలుక జేసి
బాధింపకు దయను వీడి! ॥కన్నీటిని॥

## అందుకోనీ కృష్ణ!

అందుకోనీ కృష్ణ! యంరి నీ ప్రేమలను!
చిందుకోనీ కృష్ణ! చిన్నారి గీతి!
ఆపురూపమైన నీ యందాల రూపమును
మనసులో చిత్రించి మలుచుకోనీవోయి!
అందుకోనీ కృష్ణ! యలరి నీ ప్రేమలను!
చిందుకోనీ కృష్ణ! చిన్నారి గీతి!

మధుర భక్తిఖిగూడి మాధుర్య మొలికించి
తీయని ప్రేమలను తేనెలను రుచిజూప!
కరుణతో నెదజేర్చి కారుణ్య మొలికింప
నన్ననుసరింపగా నాథ! నే మురియుదును ॥అందుకోనీ॥

దివ్యగానపుగీతి దిశలన్ని వెలుగొంద
అమృతవర్షముతోని ఆనందములు గురియ!
పారిజాతము వోలె పరిమళము జిందుచూ!
నింగిలో పయనించి నీ దరికి జేరవలె! ॥అందుకోనీ॥

రంగురంగుల నద్ది రమణీయ రూపముల!
చెరిగిపోకుండునటు జేర్చెదను యెదయందు
రాధికా హృదయమున రమ్యమున నిలిచినటు!
నా హృదయము ఫలకమున నాథ! నిను చిత్రింతు

అందుకోనీ కృష్ణ! యలరి నీ ప్రేమలను!
చిందుకోనీ కృష్ణ! చిన్నారి గీతి!

## దోస మేమీ లేక

దోసమేమీ లేక దూరమున నుంచితివి!
తగున యిది గోపాల! దయలేక యింతా!

బరువైన మనసుతో భాష్పములు గురియుచును!
విరహ గీతముతో వేఁబడి యుంటినీ!

దోసమేమీ లేక దూరమున నుంచితివి!
తగున యిది గోపాల! దయలేక యింతా!

విరహ గీతికతోని విలపింప వేదనను
ఎవరివని ప్రశ్నింప యేమి తెలుపుదు ప్రజకు?
నా గీతికయు గూడ నాథ! నిను జూడదే!
అమ్మ! ఎవరే యనిన యలరి తెలుపుదు నెటుల? ॥దోస॥

అలనాటి వ్రేపల్లె అందాల గోపికను
మాధవుని వలచినా మధురగోపిక ననిన!
నిను వదిలె యెందుకన యేమి తెలుపుదు స్వామి?
కన్నీరు స్రవియింతు కథనేమి తెలుపుదును? ॥దోస॥

విరహగీతము నాకు వేదనను జనియించె
కడుపార గంటి నా కన్నీటి ధారలను!
గడిపెదను దీనితో గలకాల మంతయును
నయమార శ్రీకృష్ణ! నను జేర్చుకొనుదాక!

దోసమేమీ లేక దూరమున నుంచితివి!
తగున యిది గోపాల! దయలేక యింతా॥

## చిటిత్రేలు జేర్చి

చిటిత్రేలు జేర్చి యా చిన్నారి కృష్ణుతో
నేబోదు చెలులార ! నిండు సిగ్గులనూ!

కల్యాణ తిలకమును కమనీయముగ దాల్చి
బుగ్గచుక్కతోసి పొలుపార వధువునై !

చిటిత్రేలు జేర్చి యా చిన్నారి కృష్ణుతో
నే బోదు చెలులార! నిండు సిగ్గులమూ!

కొండ కోనలలోని కోకిలలు ప్రీతిగా
తుమ్మెదల గుంపులూ తూలుతును నాట్యమున!
మధుర మంగళగీతి మమతతో పాడగా!
తలవంచుకొని నేను దరలుదును నిబుసితో! ॥చిటిత్రేలు॥

నా తోటలో తరులు నను జూచి పలవింప
పూలతలు కన్నిట బుజకరింపుమ జూచ!
వనదేవతలు కుసుమ వర్షమున దీవింప
ముదముతో నేబోదు ముద్దు గోపాలుతో! ॥చిటిత్రేలు॥

నీరములు క్షీరములు నిండు బిందెలతోని
తరులతల బెంచితిని తనివార ప్రేమతో!
ననుజూచి నట్లుగా నా నర్మ చెలులార!
తరులతల జూడుడో! తన్మయము మొలకెత్త ॥చిటిత్రేలు॥

చిటిత్రేలు జేర్చి యాచిన్నారి కృష్ణుతో
నే బోదు చెలులార! నిండు సిగ్గులనూ!

## అందమగు నా మనసు

అందమగు నా మనసు అద్దమగు గీతమా!
ఎందుకే వేదనలు? ఎందుకే కలతా?

తన మురళి దాపునకు తరిమి రాకనినాద ?
యడిగెదను రానిమ్ము! అందాల మాధవుని!

అందమగు నా మనసు అద్దమగు గీతమా!
ఎందుకే వేదనలు? ఎందుకే కలతా?

తప్పేమొ! ఒప్పేమొ! తగ తెలుపడాయెనా?
విప్పి చెప్పగలేద? వివరింపలేదా?
ఒకనాడు తననోట నొనర మెచ్చెను గదా!
'అందాలకుప్ప' యని యలరి పలికెను గదా! ॥అందమగు॥

తన మురళి స్వనములకు దగ నీవె తగుదువని
నిన్ననుసరించె గద! నిన్నాదల ననె గదా!
ఇప్పుడే మాయె నా వేణుగోపాలునకు
మాట తప్పుట తనకు మరియాద కాబోలు! ॥అందమగు॥

రాకపోవున యిటకు రమ్య గోపాలుడూ!
అంతరాత్మను దెలచి యడిగెదను సూటిగా!
నీపాట పాడుకో నిరతమును భక్తితో!
మురళి నీ కిప్పింతు ముద్దు నే జెల్లింతు॥

అందమగు నా మనసు అద్దమగు గీతమా!
ఎందుకే వేదనలు? ఎందుకే కలతా?

## కొండ శిఖరము పైని

కొండశిఖరము పైని కోవె లొక టున్నదీ!
రమణీయ గీతమా! నా వెంట రమ్మా!

ఆడుచును బాడుచును నటనుండు కృష్ణుడూ!
ఆలమందలతోని యలరు గోపికలతో!

కొండ శిఖరముపైని కోవెలొక టున్నదీ!
రమణీయ గీతమా! నా వెంట రమ్మా!

దివ్యకాంతులతోని దీప మొక టుండునట
అందులో మాధవుడు యలరునట యెల్లపుడు!
భక్తిగీతము బాడి పరవశించిన యెడల
ముక్తినిచ్చు నటంచు మోదమున వినియుంటి! ॥కొండ॥

ఒక్కొక్క యడుగేసి యొప్పుగా బైకెగిరి
నీ సాయమున నేను నిరవధిక సుఖమునూ!
అందగోరుచు నుంటి యఖిలేశు దయవలన
కలిసిపాడుదు నేను కమనీయ గాత్రమున! ॥కొండ॥

నా గొంతులో నమరు నవ్యసుందరముగా
వేదనాక్షరములను వినిపించు గానమున!
గొంతెత్తి పాడుదును కోకిలలు గుమిగూడ
మురళీ స్వనంబులట మోదమున నర్తింప!

కొండ శిఖరముపైని కోవెలలొక టున్నదీ!
రమణీయ గీతమా! నా వెంట రమ్మా!

## నను జూడ బోకులే!

నను జూడ బోకులే! నను జేర రాకులే!
పసిపాప నా గీతి పరగజూడుము కృష్ణ!
కన్నీటి చారలను కరుణతో బోదుడిచి
చరణ సన్నిధి జేర్చి శీర్షమున కరముంపు!
ననుజూడ బోకులే! ననుజేర రాకులే!
పసిపాప నా గీతి పరగ జూడుము కృష్ణ!

పాలబుగ్గలతోని పసిడి ఛాయలు గలది
వేదనాశ్రువులందు వింతగా బుట్టినది!
నినుజూడ నాశించు నిండు హృదయముతోని
చిరుగజ్జె లల్లాడ జెలగి నర్తనసేయు! ॥నను॥

సెలయేటి యలలలో జెలగు బేడిసవోలె
నిముసమైనను గూడ నిలిచి శాంతిని గొనదు
మబ్బుల్లో విహరించు మసలు సంజలయందు!
తారలతో ముచ్చటలు దగ చందమామతో ॥నను॥

నా వలెను నిది కూడ నలుగుచున్నది కృష్ణ!
నీ దర్శనమునకయి నిను జేర కాంక్షతో
కఠిన మార్గములందు కలత బడుచున్నదీ!
నను బ్రోవకున్న సరి నా గీతి గరుణింపు !

నను జూడ బోకులే! నను జేర రాకులే!
పసిపాప నా గీతి పరగ జూడుము కృష్ణ!

## మఱచి పోను!

మఱచిపోను! మఱచిపోను!
మాధవ! నీ నామ మెపుడు!

ఓడువను ఒకనాటికి నీ
విమలమైన మధుర గీతి!

మఱచిపోను! మఱచిపోను!
మాధవ! నీ నామ మెపుడు!

విరహముచే కలత నంది
వేయి బాధ లందుచున్న
దూరముగా నుంచి నన్ను
దురపిల్లగ! జేయుచున్న! ॥మఱచిపోను॥

భవ బంధములను దాటగ
భక్తి మనసు నర్పించితి
మురళీ రవముల విని నే
మోహించితి చిన్ననాడె! ॥మఱచిపోను॥

ఎటుల మఱతు పతివి నీవు?
వేయి జన్మములకు నైన!
నీ గీతమె యిపుడు నాకు
నిజముగ జీవము ప్రాణము! ॥మఱచిపోను॥

పాడుచుందు నిటుల నేను
ప్రళయము జరిగెడి దాతను!
ఉపగ్రహమును స్వామి నీకు
ఊడిగమును! జేయు దాసి!

## శ్రీకరంబయిన

శ్రీకరంబయిన నీ చిఱునవ్వులను నాదు
మనసులో వెదజల్లు! మాధవా! యెపుడూ!

తీయనీ నీ మురళి తేనెలను నే గ్రోలి
యానంద వాహినిని యటు తేలిపోవుదును!

శ్రీకరంబయిన నీ చిఱునవ్వులను నాదు
మనసులో వెదజల్లు మాధవా! యెపుడూ!

మధు వసంతమునందు మావి కొమ్మలపైని
కుహూ కుహూ రవములను కోకిలలు బాడగా!
నా గొంతులోనుండి నవగీతములు వెడలి
నీ రాగబంధమున నిలిచి పోవలెనోయి! ॥శ్రీకరంబైన॥

వనమయూరమువోలె వయ్యార మొలికించు
నవనాట్య రీతులను నాకు దయసేయుమా!
హంసవలె లాస్యమును నపురూపముగ నిమ్ము!
నీ యడుగు జాడలను నీటుగా నిలిచెదను! ॥శ్రీకరంబైన॥

కడలిలో తరగలా కదిలిపో నా కోర్కె!
పూవులో తావిలా పొరలిపో నాయాశ
శిల్పమై ప్రతిమనై చిత్రమగు నీ మురళి
రాగాల రవళిలో రగిలిపో నా కోర్కె!

శ్రీకరంబైన నీ చిఱు నవ్వులను నాదు
మమనసులో వెదజల్లు! మాధవా! యెపుడూ!

## అంతరంగమునందు

అంతరంగమునందు నది యేమి చిత్రమో!
వెంటాడు భావమెదో వేయి రాగాలుగా!

అంటినది! అతికినది!
అపురూప చిత్రముగ!
విడువ దది యేలకో!
వేయి జన్మల కయిన!

అంతరంగము నందు నిదియేమి చిత్రమో!
వెంటాడు భావమెదో వేయి రాగాలుగా!

చుక్కలను జూచినా! సూటిగా చంద్రునీ!
పాలవెన్నెలజల్లు బరగ వీక్షించినా!
మబ్బుకన్నెల్లోని మాధుర్యమును గనిన
ఆభావ రాగమే యలుముకొను యెద నంత!

కిన్నెరను మీటినా గీతమును నే విన్న
కొండకోనలలోని కోకిలను నేవిన్న!
అందాల తుమ్మెదా యాటపాటలగన్న!
ఆ రాగమే యెదను నావరించునువేగ!

పతిరూపమే నన్ను బరగ వెంటాడునది!
అంతరంగమునందు నతికినా చిత్రమే!
అందాలరాగాల యపురూపములు గనిన
పొగమంచువలె కలత పొంగి పైపై లేచు!

అంతరంగమునందు నది యేమిచిత్రమో
వెంటాడు భావమెదో వేయి రాగాలుగా!

## చక్కనీ నీపాట

చక్కనీ నీ పాట చిక్కదనమున కృష్ణ!
పారవశ్యముతోని పక్షి నయ్యేనూ!

భూమి యాకాశాలు పొలుపుగా దిరుగుతూ!
ఆకాశగంగలో హంసనయి పోతాను!

చక్కనీ నీపాట చిక్కదనమున కృష్ణ!
పారవశ్యము తోని పక్షి నయ్యేనూ!

ఆఱు ఋతువులలోని యందాలు మేయుచును
కొండకోనల దాటి కొసలన్ని తాకేను
నదుల సంద్రాలలో నాట్యాలు చేసేటి
తరగలను నేనొక్క తరగనయి పోతాను! ॥చక్కనీ॥

తారలను నేజేరి తళుకునయి పోతాను!
వెన్నెలల తీగనై వింతలను బోతాను!
హరి విల్లులో నొక్క యందాల ఛాయ నయి
భువికి దివికీ మెట్లు పొలుపుగా గడతాను! ॥చక్కనీ॥

పాటతో నా మనసు పరమపదమును జేరి
నీ నిండు సభయందు నిలిచి నృత్యము సేయ!
అపుడయిన దయజూపి యాశలను దీర్తువా?
దాసిగా దయజూపి దరిజేర్చి కొందువా?

చక్కనీ నీపాట చిక్కదనమున జేరి
పారవశ్యము తోని పక్షినయ్యేనూ!

## ఆ దినమది

ఆ దినమది వచ్చున మఱి?
యాగోపిక నగుదునా?

మాధవ! నీతో గడిపిన
మధుర క్షణము లిక వచ్చునె?

ఆ దినమది వచ్చున మఱి?
యా గోపిక నగుదునా?

బృందావన వీధులలో
అందముగా నిన్నుగూడి!
రాసక్రీడ లాడిన యా
రమ్యదినము లిక వచ్చున? ॥ఆ దినమది॥

విమలమైన మురళి వినుచు
యమునా నది తీరములో
గడిపిన యామధుర నిశలు
గలుగున మఱి యొక నాటికి? ॥ఆ దినమది॥

మఱల మఱల ఋతువు లొచ్చి
మాధుర్యము గూర్చు చుండె!
దినదినమును మఱల వచ్చి
దీవ్వుల నిల విరియుచుండు! ॥ఆ దినమది॥

ఆ దినములు మఱల వచ్చి
అమరత్వము నొందుదునా?
వేచుకొనుక కనుచుంటిని
వేయికనులతోని కృష్ణ! ॥ఆ దినమది॥

## ఈ శరద్రాత్రిలో

ఈ శరద్రాత్రిలో! ఈ పూర్ణిమా నిశివి!
యణువణువు పులకించె నందాల వెన్నెలను!

ప్రత మాచరించినా వన్నెలా పడుచువలె
నా మనసు పులకించె నవరాగ సుధలలో!

అణువణువు పులకించె నందాల వెన్నెలను!
ఈ శరద్రాత్రిలో ఈ పూర్ణిమా నిశిని!

గూటిలో నున్నట్టి దీపకాంతికి వోలె
మబ్బులో తులకించు మధుర సంజకువోలె!
బాల గోపాలునీ భక్తితో స్మరియించు!
మునుపులో దూగాడు ముద్దరాలీ నైతి! ॥ఈ॥

హంసబారుకు వోలె నాకాశమందునా!
తేలిపోవుచునున్న తెలికాంతి రేఖలా!
తెలుగు పిట్టల బాడు తీయనీ రాగాలు!
నా మనసులో కదిలి నాట్యాలు చేసినవి! ॥ఈ॥

నీ కొలకు నా ప్రతము!నీ కొలకు నా గీతి!
నా వొత్తువనుచు నే నింగి జూచుచు నుంటి!
వెన్నెలను దిగివచ్చి వేడుకను మురళితో!
పాట పాడీకృష్ణ!-పరవశత గలిగించు!

అణువణువు పులకించె సందాల వెన్నెలను!
ఈ శరద్రాత్రిలో ఈ పూర్ణిమా నిశిని!

## ఆనంద గ్రంథిగా

ఆనంద గ్రంథిగా నవతరించితివి గదె!
ఎందుకే ఓ గీతి! యేలనే చింతా!

నీకు నే నున్నాను! నీకు అత డున్నాడు!
భువన మోహనమైన మురళి నీ కుండగా!

ఆనంద గ్రంథిగా నవతరించితివి గదె!
ఎందుకే ఓ గీతి! యేలనే చింతా!

మురళిపాటను జారి మోదమున ననుజేరి
నా గొంతులో నుండి నవసుందరము గాగ!
గీతివై వెడలితివి ప్రీతిగా మురళితో!
ముడి వేసికొంటివీ ముద్దుగా నందముగ!

బాలగోపాలునీ భక్తితో నే బాడి
దాసినై పోతినీ దయగోరి యాతనికి!
నీ వలననే గదా! నిఖిలేశు సర్వాత్మ!
దయ జూరగొంటినీధన్యాత్మ నైతినీ!

ఎడతెగని బంధమిది యేండ్లు పూండ్లనునైన
ఆ మురళికిని నీకు అఖిలేశునకు నాకు!
ఆనంద గ్రంథి యిది! అందాల ప్రేమ ముడి!
దివిని భువినీ గలుగు దేవతల సాక్షిగా!

ఆనంద గ్రంథిగా నవతరించితివి గదె!
ఎందుకే ఓ గీతి యేలనే చింతా?

## చిని చిన్ని చివురులను

చిని చిన్ని చివురులను చిన్ని చిన్ని పూవులను
మాధవా! నీ కొఱకు మాల గూర్చితినీ!

మధుర పదములతోని మధురగీతిని గూర్చి
తీయనీ కంఠాన తేనె లొలుకుచు నుంటి!

చిని చిన్ని చివురులను చిని చిన్ని పూవులను
మాధవా! నీ కొఱకు మాల గూర్చితినీ!

చేసినా తప్పులను చెఱిపి నా మనసునూ
తెల్లనీ పూవుగా జేయ మనుచును స్వామి!
నింగి తారకు వోలె నిలిచినటు నా మనసు
పాటగా లోకాన బాటనవ్వాల అనుచు! ॥చిని చిన్ని॥

ఆకురెమ్మల చాటు నఱిగియుంటిని స్వామి!
గతకాలమును దలచి కంటి నీరొలుకుచును!
విలపించు చుంటినీ! వేదనల దొంతరను!
సెలయేటి బుడగవలె చెలగి కన్నీరొలికి! ॥చిని చిన్ని॥

విడివడిన సతిని నే వేదనల దొరలించి
అగ్గిలో నిలుపకుము! అలసతను గూర్పకుము!
నీ దాసి నో కృష్ణ! నిలుము! నీలో గలతు!
జ్యోతిలో జ్యోతిగా ప్రీతి నొకటగు నటుల

చిని చిన్ని చివురులను చిన్నారి పూవులను
మాలగా గూర్చితిని మాధవా! నీకూ!
మధుర పదములతోని మంజులంబగు గీతి
తీయనీ రాగాన తేనె లొలుకుచునుంటి

## ఆకాశవీధిలో

ఆకాశవీధిలో అందాల దీపమటు!
వెన్నెలలు వికసించె వేడ్క జాబిల్లి!

నా మనసు మందిరము నవ్యకాంతులతోని
మురళినూదుచు నిలిచె ముద్దుగా కృష్ణుడూ!

ఆకాశవీధిలో అందాల దీపమటు
వెన్నెలలు వికసించె వేడ్క జాబిల్లి!

మబ్బు మాయాలేని మధురమగు రాత్రిలో
చుక్కలను నిండినా సుందరంబగు నింగి!
అగుపించినటుల నా యంతరంగమునందు
వేయి భావాలతో వేడుకను గలిగించె! ॥ఆకాశ॥

ఎచటినుండోకాని యే మూల నుండియో
అలలవలె తెరలవలె నబ్బురంబగు వింత
మురళీ స్వనమ్ములవి మోదమున వినిపించు
మధుర గోపిక నగుదు! మనసు సుడులను దిరుగు! ॥ఆకాశ॥

కలువ తామరలతో విలసిల్లు కొలనులో
చందమామా నిలిచి యందాలు జూచినటు!
నా మనసులో జూచు నందగోపాలుడూ!
తన రూపు రేఖలను తన మురళి అందాలు!

ఆకాశవీధిలో అందాల దీపమటు
వెన్నెలలు వికసించె వేడ్క జాబిల్లి!

# ప్రకృతి యందాలలో

ప్రకృతి యందాలలో పారవశ్యము జెంది
ప్రణయ భావముతోని పాడనీ కృష్ణా!

అణువణువునందున్న అందాలు నీవెగా
నన్నులీనము జేయి! నాట్యసుందర మందు!

ప్రకృతి యందాలలో పారవశ్యము జెంది
ప్రణయ భావముతోని పాడనీ కృష్ణా!

కొండ లడవులు నదులు కోనలందలి ఝరులు
ఆకాశమందునా యలరేటి తారకలు!
కలువ తామరలతో కులికేటి కొలకులూ
పాడుచున్నవి గదా! దివ్య రాగమునందు! ॥ప్రకృతి॥

పుడమి యాకాశాలు పొలుపొందు పక్షులూ
జననమందిన సృజన శక్తి యంతముగూడ
గొంతెత్తి పాడుచూ కోమలంబగు గీతి
నాట్యమాడే రీతి నాథ! నీవే గదా! ॥ప్రకృతి॥

శక్తితో ప్రణమిల్లి ముక్తిగీతముతోని
ఆనంద వేదికను నాటలాడుచునుండె
నేగూడ గోపికగ నీపాట పాడనీ!
ముక్తి గీతముతోని మోదమును పొందనీ!

ప్రకృతి యందాలలో పారవశ్యము జెంది
ప్రణయ భావముతోని పాడనీ కృష్ణా!

## పాడవే హృదయమా!

పాడవే హృదయమా! భక్తిభావము తోని
మాధవుని గూర్చి నా మాధవుని గూర్చి!

పీణమీటిన యటుల విమల ఛందస్సునా
లలిత పదములతోని లాలిత్య భావముల

పాడవే హృదయమా! భక్తిభావము తోని
మాధవునిగూర్చి నా మాధవునిగూర్చి!

బృందావనమునందు నందముగ కృష్ణుతో
రాసక్రీడలయందు రమ్యముగ నర్తించి!
ముగ్ధభావముతోని మోదముగ పాడినా!
ఆపాట పాడవే యందాల బాణిలో! ॥పాడవే॥

విడిపోతి! వేరయితి! వేదనల పాలయితి!
కాంతిలేనీ దీప కళికగా నేనయితి!
అతని నే మఱచితిని యతడు మఱచెను నన్ను!
జన్మజన్మలు నిటుల గడిచిపోయెను గదా! ॥పాడవే॥

శాపమేదో తగిలె శమియించె నేటికది!
నే నెవరినో యేమొ నేటికది స్ఫురియించె!
బాలకృష్ణుని యందు భక్తిభావము గలిగి
గీతితో జేరగా ప్రీతి దలచుచునుంటి!

బాడవే హృదయమా! భక్తిభావము తోని
మాధవునిగూర్చి నా మాధవునిగూర్చి!

## పరికిణీ గ్రొక్కాడు!

**పరికిణీ త్రొక్కాడు పసిపాప నడకలా!**
నా భావ గీతమది. నడయాడు చుండే!

సన్ననీ సెలయేటి జాలులా తడబడుచు
నీ కొఱకు తపియించి నిట్టూర్పుచున్నదీ!

పరికిణీ త్రొక్కాడు పసిపాప నడకలా
నా భావగీత మది నడయాడుచుండే!

కొండ లడవులు దాటి కోటి శిలలను దాటి
మిట్ట పల్లాలనూ మెట్టి సుడులను దిరిగి!
నిలిచిపోయీ జరుగు సెలయేటి ధారలా
కదులుచున్నది గీతి! కాంతి రేఖను జూడ! ॥పరికిణీ॥

తూర్పు కొండలపైని తొలికినా కుంకుమల
కాంతిలో లీనమై కలిసిపోవా లనుచు
రెక్క లల్లార్పుచును రిక్కలా పయనించు!
పక్షిలా నా గీతి పయనించు చున్నదీ! ॥పరికిణీ॥

తల్లి యొడిలో జేర తపియించు బాలవలె
పతి కౌగిలిని గోరు పడతి కోరికవోలె!
సృష్టి యందా లన్ని శృతిలయల గోరినటు
నా గీతి నిను జేర నర్తించు చున్నదీ!

పరికిణీ త్రొక్కాడు పసిపాప నడకలా!
నా భావగీత మది నడయాడుచుండే!

## సృష్టి యందములన్ని!

సృష్టి యందము అన్ని నీవే
సృజన కర్తవు నీవె గాదా!

విద్యలన్నియు వీర్చికూర్చిన
వేల్పు వీవే మాధవా!

సృష్టి యందములన్ని నీవే
సృజన కర్తవు నీవె గాదా!

మధుర గీతము లాలపించుట
మధుర భక్తిని నిన్ను గొలుచుట!
పరమ పథమును జేరుటకు గద
భావగీతము లన్నియున్! ॥సృష్టియందము॥

చిత్రలేఖన శిల్పవిద్యలు
మహలులందున గుహలయందున
అందమగు నా సుందరంబులు
అన్ని నీ కొలకే గదా! ॥సృష్టియందము॥

అభినయించుట యాడి పాడుట
నవ్యరీతుల నాట్యమాడుట!
గజ్జెకట్టి కమ్మనైనా
గాన కళలను జూపుటన్ ॥సృష్టియందము॥

సృష్టి యందలి కళలవన్ని
సుందరంబగు విద్యలన్ని
నిఖిల మంతయు కలిసిపోవును
నీలో లయమగు సర్వమున్! ॥సృష్టియందము॥

## భక్తి చేతను!

భక్తి చేతను మనసు కఱిగి
పరువు లెత్తుచు నున్నదెటకో!
మాధవుని కై పలవరించుచు
మధుర నృత్యము సేయుచున్! ॥భక్తిచేతను॥

రెక్కలల్లార్చుచును నింగిని
రిక్కలందున సంచరించుచు!
పక్షివలె నే బోవుమంటిని
పతిని జేరగ రివ్వునన్! ॥భక్తిచేతకు॥

సప్త స్వరముల సరస గీతము
సాదురీతిని బాదుకొనుచును!
ప్రక్కవాద్యము లిడగ హంసలు
పరవశంబుగ సోలుచున్! ॥భక్తిచేతను॥

సంజకాంతుల కుంకుమలలో
స్నానమాడి ఉదయ గిరిపై!
ప్రక్క వాద్యము లిడగ హంసలు
పరవశంబుగ సోలుచున్! ॥భక్తిచేతను॥

ఆగిపో దీ మధుర గీతము
ఆగిపో దీ మధుర ప్రణయము!
మాధవుని నే జేరుదాకను
మనసు గలిపిన దాకనూ! ॥భక్తిచేత॥

## విత్తనము మొలకెత్తి!

విత్తనము మొలకెత్తి నా మది
విరులు పూచెను రెమ్మ రెమ్మను

భక్తితో నొక మాల గూర్చితి
భాప గీతము దోడుతన్!

విరులు బూచెను రెమ్మ రెమ్మను
విత్తనము మొలకెత్తి నా మది

ఎన్ని దినములు గడచిపోయెను
ఎన్ని జన్మలు గడిచిపోయెను!
ఇన్ని దినముల కయ్యె నా మది
చిన్నదీపము వెలుగుగా! ॥విత్తనము॥

వినీ వినబడ నట్లుగా నా
విభుడు మురళీ నూదినట్టుల!
కనీ కనబడనట్లుగా నా
కాంతుడొచ్చిన యట్లుగాన్ ॥విత్తనము॥

మధుర స్వప్నము గాంచినట్టుల
మనసు ఆనందమున మునిగెను
కొలనిలోనీ కలువ పూవుగ
క్రొత్తదనమును బొందితిన్! ॥విత్తనము॥

ఎందుకిక ప్రభు! దాగుమూతలు?
చిందనీ నీ కాంతిరేకలు!
అందముగ నీ చరణ కమలము
అందుకోనీ మాధవా! ॥విత్తనము॥

## అందాల కృష్ణుని

అందాల కృష్ణునీ సుందరుని గాంచగా!
మధురోహలను మునిగి మధుమతిని నైతీ

ఇందందు వెదికినా యెందు గనరాడు చెలి!
కందె నా మనసంత రెండుగా చీలినది!

అందాల కృష్ణునీ సుందరుని గాంచగా
మధురోహలను మునిగి మధుమతిని నైతీ!

ఆకాశవీధులను హంసనయి గాంచితిని
చుక్కనై రిక్కలను సూటిగా జూచితిని!
పుడమినంతా వెదికి పులకించు ప్రకృతిని
తరులతల వెదికితిని తగనెందు డాగెనో! ॥అందాల॥

కన్నీరు వరదలయి కాల్వలే గట్టినది!
విలపించు నాగీతి వీధులే నిండినది!
చింతాకు నయిపోతి! చిగురాకు నయిపోతి!
చిన్ని కిరణ మటంచు జేరదీయడు మదిని! ॥అందాల॥

కనిపింపకున్న సరి వినకున్న సరియెలే!
కనికరములేచె యా కమలేశు చిత్రమును !
నా యెదుట నుంపవే నవమోహనాంగునీ
వేడుకను నే జూతు! వెన్నెలను రాత్రంత!

అందాల కృష్ణునీ సుందరుని గాంచగా
మధురోహలను మునిగి మధుమతిని నైతీ!

## పూదోట గాంచినా!

పూదోట గాంచినా పున్నమిని జూచినా
నీ విరహ జ్వాలలే నిండు హృదయానా!
కాటుకను దడిసినా కన్నీటి ధారలే
ఎటుజూచినాగాని యేమి కనిపింపదూ!

పూదోట గాంచినా పున్నమిని జూచినా
నీ విరహ జ్వాలలే నిండు హృదయానా!

చివురు పూవులతోసి చిందేటి వనవీధి
మందమారుతముతో మాధుర్య మంతయును!
వేడి వడగాడ్పులయి వేదనను గలిగించు!
చిన్ని కృష్ణా! నీదు చింతనను మనసంత ! ॥పూదోట॥

చల్లనీ చంద్రునీ సాంద్ర కిరణములన్ని
పాలవెన్నెల ప్రకృతి బంగారు సోయగము!
సన్ననీ సూదులయి చిన్ని హృదయమునందు
కసిదీర గ్రుచ్చుకొను కలత నలతలు పొంద! ॥పూదోట॥

కనులు మూసినగాని కనులు దెఱచినగాని
కన్నీటి ధారలే గలగలా బ్రవహించు!
తడియార దెప్పుడును తరుణ! నీ విరహాన
ఈ కన్ను లెట్టివో! యీ హృదయ మెట్టిదో!

పూదోట గాంచినా పున్నమిని జూచినా!
నీ విరహజ్వాలతో నిండు హృదయానా!

## వినిపింపకోయ్! మురళి!

వినిపించి నా మనసు
వేదనల నింపకూ
నీ మురళి స్వనములను
నీ మధుర ధ్వనులా!

గడిచినా కథలన్ని
కనులముందఱ నిలిచె!
గతకాల వైభవము
కదలాడె హృదయమున !

బృందావనమునందు
నందాల గోపికగ
ఆడిపాడిన దినము
లాత్మలో తూగాడె!

అణగారి యున్నట్టి ఆత్మతో విరహమది!
నీ మురళి నాదమున నింగి పైకిని లేచె !
మురళినాపి నన్ను మోదమున జేకొనుము
ఓపలేనీ సుఖము ఆపలేనోయ్ కృష్ణ!

పొక్కు కట్టిన వుండు
పులకలను సెలవేసి
ఓర్వలేని బాధ
యొనరించె నీ మురళి

## ఒక్కసారి

ఒక్కసారి! ఒక్కసారి!
వినిపింతును విమలగీతి!

మక్కువతో ప్రార్థనవిని
మన్నింపుము చిన్నికృష్ణ!

ఒక్కసారి! ఒక్కసారి!
వినిపింతును విమలగీతి!

జన్మ జన్మముల క్రిందటి
చరితమేమొ తెలియలేను!
ఈ జన్మము నందు నిన్ను
నింపారగ తెలిసి కొంటి!

సకల జీవులందు నీవె
చరియింతువు జాగృతిగా!
చైతన్యపు వీధులలో
చరియింపగ జేతువీవె!

మనసునిచ్చి మమతనిచ్చి
మధుర భావగీతి నిచ్చి!
మానవతా సమభావపు
మాధుర్యము నిచ్చి తీవు!

నా మనసున నిలిచి నీవు
నవనీతము చిలుకవోయి!
దీర్ఘయాత్ర పథికుడ నే
దీవింపుము నన్ను జేర!

# ఆర్ద్ర భావమునను వేడు

ఆర్ద్రభావమునను వేడు
ఆర్తినేల వినవాకో!

రాళ్ళుగూడ రోదనలను
రవలు జేయుచున్నవిగా!

ఆర్ద్రభావమునను వేడు
ఆర్తి నేల వినవాకో!

కరుణ నేలువాడ వనుచు
కారుణ్యపు మనసువనీ!
మనసు నిచ్చి మ్రొక్కుచుంటి
మన్నింపవుగా దయనూ! ॥ఆర్ద్రభావమున॥

చిందిన నా వేదనంత
చిఱుగాలుల మంటలాయె!
కన్నీటిని జూడు మదిగొ!
కలహంసల కొలకులాయె! ॥ఆర్ద్రభావమున॥

కొండలలో ఖండలవిగొ!
కొనలు చెదిరి రోదనలను!
అనుకరించుచుండె నన్ను
ఆర్ద్రభావ గీతికలను! ॥ఆర్ద్రభావమున॥

ఆత్మార్పణ జేసి నీకు
అంజలి ఘటియించు నన్ను!
కరుణ బ్రోవ కెవరికినై
కారుణ్యము దాచితివో? ॥ఆర్ద్రభావమున॥

## నవ వసంత ఆగమనము!

నవవసంత ఆగమనము!
నాథ! నీదు ఆగమనము!

అణువణువును ఋలకించెను
హర్ష బాష్ప నయనములను!

నవవసంత ఆగమనము!
నాథ! నీదు ఆగమనము!

మోడులన్ని చిగురించెను
మోహన రాగములతోని!
పూ దీవెలు కుసుమములను
పుడమి రాల్చి పులకించెను! ॥నవవసంత॥

కోకి లొకటి కోనలందు
కోసరిపాడె సరిగమలను!
సెలయేటిని గలగలమని
జాలువారె సిగ్గుతెరలు ॥నవవసంత॥

మందమంద వీచిక లవె
మధురముగా వీవసాగె!
పున్నమి చందురుడు గూడ
పులకరించె రోహిణితో! ॥నవవసంత॥

అందాలను చందాలను
నందింతువు ప్రకృతి కంత!
నన్నెందుకు పులకింపవు
నాథ! నీకు దాసిని గద! ॥నవవసంత॥

## తరులార లతలార!

తరులార! లతలార! తగ శకుంతములార!
వన్య మృగమూలార! వరుసగా మీరూ!

ప్రాత మిత్రములు మా ప్రాత బంధువులు గద!
విడిపోయినా మమ్ము నేక మొనరింపుడో!

తరులార! లతలార! తగ శకుంతములార!
వన్య మృగమూలార!వరుసగా మీరూ!

పతినుండి దూరమయి
పరదేశమున నుంటి!
విధి చైదమున నేను
వేరయితి పతినుండి! ॥తరులార॥

ఆనాటి మా ప్రేమ
ఆలనాటి ప్రణయమా!
అన్ని తెలియును గదా!
అమ్మలారా! మీకు! ॥తరులార॥

నా పిలుపు అన్నియును
నవ్వులా పాలాయె!
నా ప్రేమ పుష్ప మిది
నలిగి చీరిక లాయె! ॥తరులార॥

ప్రాతబంధువులు మీ
పలుకు విను నా విభుడు!
తెలియజెప్పి నన్ను
జేర్చుకొన జేయుడి! ॥తరులార॥

## ఎచట నున్నాడమ్మ!

ఎచట నున్నాడమ్మ! కృష్ణుడు?
ఇచట లేడే అచట లేడే!

వెదికి వెదికీ యలసిపోతిని!
వీధి వీధీ వాడవాడలు!

ఎచట నున్నాడమ్మ కృష్ణుడు?
ఇచట లేడె! అచట లేడే!

కిన్నెరను నే చేతబట్టి
చిన్నికృష్ణా! యనుచు బాడుచు!
సందుగొందుల నన్ని వెదికితి!
చిన్నికృష్ణుడు గానరాడే!

మావితరువుల మల్లెపొదలను
మాలతీలతలన్ని వెదికితి!
కలువతామర పూలు విరిసిన
కొలుకులన్నీ తిరిగి వెదికితి!

మనిషి మనిషిని నిలిపియాపీ
మాధవుని శుభవార్త నడిగితి!
కంటి నీరే నాకు మిగిలెను
కలత నలతే యెదను నిండెను!

మనసులో జిగురాకు వేసీ
మధుర ప్రేమను బెంచు టెందుకు?
భావగీతిని నిలుపు టెందుకు?
బ్రతుకు బరువును జేయు టెందుకు?

## ఎన్నెన్నో!

ఎన్నెన్నో! మఱి యెన్నెన్నో!
ఎన్నెన్నో! మఱి జన్మల కయినా!

విడివడిపోనిది యీబంధం!
సుడివడిపోనిది యీ గీతం!

ఎన్నెన్నో! మఱి యెన్నెన్నో
ఎన్నెన్నో మఱి జన్మల కయినా!

ఆత్మార్పణమని యంతా నీవని
యర్పించితినీ యానాడూ!
చిన్నికృష్ణ! నిను జేర్చితి మదిలో
చిరబాంధవునిగ గోపికనై! ॥ఎన్నెన్నో॥

ఎన్నిజన్మ లిటు గడిచినవో మఱి
ఎన్ని యుగములిటు నడిచినవో!
ఎంతకాలమిటు జరుగవలయునో!
అంతము లేనిది యీ స్నేహం! ॥ఎన్నెన్నో॥

నాయెదలో నీరూపము జెరుగదు!
నాథ! నీభక్తిభావము తొలగదు!
మదిలో వెలసిన మధుర గీతమును!
మానిపోదు ప్రతి నిముసము బాడుదు! ॥ఎన్నెన్నో॥

భక్తిభావ మెప్పుడైనా చెఱుపకు
భావగీతి నెప్పుడైనా యాపకు!
నీకు నాకు ప్రేముడులివి గాదా!
నీరజాక్ష! ముడు లిటులే యుంపుము! ॥ఎన్నెన్నో॥

## అందముగ

అందముగ నే పాటపాడగ
సుందరుని గోవిందు గూర్చి!

విందుగూర్చెను ప్రకృతి కంతకు
చిందినవి యానంద రవళులు

అందముగ నే పాటపాడగ
సుందరుని గోవిందు గూర్చి!

మింటిచుక్కలు కదిలియాడెను
చంటిపాపల పరువు లట్టుల!
సన్ననీ జాబిల్లి రేకలు
కన్నెవలపుల సిగ్గు తొలికెను! ॥అందముగ॥

కోకిలమ్మా కూతవెట్టెను
కొండ కోనలు మారుమ్రోవగ!
వనమయూరము వన్నెలొలుకుచు
వగలు వోవుచు నాట్యమాడెను! ॥అందముగ॥

పూలుపూచీ పరిమళించీ
పున్నమీ వెన్నెలగ మారెను!
పసిమివెన్నెల పులకరించెను
పడతివలె వనవీధి మెరిసెను! ॥అందముగ॥

ఇంత ప్రేమని తెలుపలేనూ!
ఎంత ప్రేమో ప్రకృతిమాతకు!
నన్ను జూచీ తాను మురియును!
అన్ని మఱతును ప్రకృతియొడిలో! ॥అందముగ॥

## మనసు రాయిగ

మనసు రాయిగ జేసికొంటిని!
మాధవా! యిక నిన్ను బిలువను!

గొంతునెత్తి కొసరి కొసరీ
కోకిలకు వలె పాటపాడను!

మనసు రాయిగ జేసికొంటిని!
మాధవా! యిక నిన్ను బిలువను!

చంద్రకాంతులు వెల్లివిరిసే
సాంద్ర నిశలకు దూరముండుదు!
కలువ తామర అందముల యిక
గాంచనని యిదె! ప్రతిన బూనితి! ॥మనసు రాయిగ॥

చల్లగాలుల పిల్లగాలుల
కల్లగా దిక తరిమి వేయుదు!
గాలికల్లలలాడు తీవెల
కమ్మనీ యందముల గాంచను! ॥మనసు రాయిగ॥

చిలుక గోరింకలా స్నేహము
చెరిపివేయుదు నేటినుండీ!
పాటనేర్చే కోకిలమ్మను
పారదోలుదు మావితోటకు! ॥మనసు రాయిగ॥

నీవులేనీ రాగమెందుకు?
నీవురానీ గీత మెందుకు?
మౌనమూదును! మధురమురళీ
మఱల నాచెవి సోకు వఱకును! ॥మనసురాయిగ॥

## ప్రియమార కృష్ణ!

ప్రియమార కృష్ణ! నీ ప్రేమ గీతము వినక
చెదిరిపోవుచు నుంటి చిఱుగాలి తరగలా!

దయతోని యెద జేర్ప జాచినా చేతులకు
దరిజేరకను నేను దగ దూర మగుచుంటి !

ప్రియమార కృష్ణ! నీ ప్రేమ గీతము వినక
చెదిరి పోవుచునుంటి చిఱుగాలి తరగలా!

నీలాంబరము నీవు! నిలిచినా చుక్క నే!
యొడి జేర్చుకొని నన్ను యోదార్ప దలచితివి!
జరిగిపోవుచు నుంటి దరి రాక దూరముగ
ఆటలాడే పాప యలరినటు బరుగిడుచు!

ఎద జేర్చి కరుణతో మది పొంగిపోవగా
ఉయ్యాల లూపగా మాహించితివి కావి,
కఱిగిపోకను నీదు కమనీయ కౌగిలిని
దూరముగ పరుగులిడి ధూళి గలియుచునుంటి! ॥ప్రియమార॥

మురళి నిస్వనములను మురిపెములు వినలేక
పక్షి పలుకులకునై పలవరించుచు నుంటి!
సరితలో నే నీది సయ్యాటలాడకను
ఉప్పునీటిని గలియ నురకలెత్తుచు నుంటి! ॥ప్రియమార॥

నీ మధుర ప్రేమలను నీ మురళి స్వనములను
నొలుకుచుంటిని స్వామి యెప్పుగా నిరతమును!
ఆ ప్రేమ లాలనల యందుకొనలేక నే
తిరుగాడు చుంటిని! తీరమును జేరకను! ॥ప్రియమార॥

## హృదయమా! మేల్కొనుము!

హృదయమా! మేల్కొనుము! సదయు డొచ్చే వేళ!
బలబలా తెలవారె! భవ్య కాంతులతో!
కారు జీకటు లవే కదకుబోయెను గనుము!
ప్రాభాత సంధ్యలవె! బరగ వ్యాపించినవి!
హృదయమా మేల్కొనుము! సదయు డొచ్చేవేళ
బలబలా తెలబారె భవ్య కాంతులతో! ॥హృదయమా॥

అణువణువు నందునను నాతడే గద నిలిచె!
బగలు రాత్రియుగూడ బన్నుగా నతడు గదె!
అవని యంబరములును నతని యానతిలోన
దిరుగుచున్నవి జూడు దీరుగా బ్రకృతిని! ॥హృదయమా॥

విశ్వమంతా నతని విమలమౌ మురళితో
పాటబాడుచు నుండె బన్నుగా స్వరములను!
కొలనిలో తామరలు కూర్మి కలువల పూలు
అతని కనుజూపుకే! అందాల కదలికలు! ॥హృదయమా॥

ఆ మురళి నాదాలు నాలోన వినిపించి
పాటలుగ మాటలుగ బరగ రెక్కలు జాపి!
ఆకాశమందునా నలరు హంసకువోలె
విహరించుచుండునే విమల సౌందర్యమున!

హృదయమా మేల్కొనుము! సదయు డొచ్చేవేళ!
బలబలా తెలవారె! భవ్య కాంతులతో!

# నిరీక్షణ

## (లలిత గీతాలు)

నీ నిరీక్షణమందు నిలిచితిని గోపాల!
పాలపుంతయు గూడ పదమరకు జరిగే!

కనిపింతువని నేడు కమ్మనీ యాశతో
ఏకాంతమున నేను నెదురు జూచుచు నుంటి

నీ నిరీక్షణమందు నిలిచితిని గోపాల!
పాలపుంతయు గూడ బదమరకు జరిగే! ॥నీ నిరీక్షణ॥

కిన్నెరను మీటుతూ కీర్తనల బాడుతూ
కన్నార నినుగాంచ కాంక్షించితిని స్వామి!
ఆడుతూ బాడుతూ అందాల మురళితో
కనులబండువుగాగ కనిపింపవేలరానోయ్! ॥నీ నిరీక్షణ॥

మౌన మూనితి వేల మాటాడ కుండగా
సఖిని! పీ పిటు సేయ సరసమేమో నీకు
అటులైన నేగూడ నాలపించక గీతి
మనసులోనే నేను మౌనమూనుదు స్వామి! ॥నీ నిరీక్షణ॥

ఉదయ సంధ్యలు గురిసి సదయ తెలవారులే
నీ దయా కిరణాలు నిఖిలమంతా నిండు!
మంచు ముత్యాలుగా మహినంత నిండుకొను
సెలయేటి జాలుగా జెలరేగు వనమంత!

కొండ కోనల నంత కూర్మి పక్షులధ్వనులు
అపుడైన జూతు నిను అందాల ప్రకృతిని! నీ నిరీక్షణ॥

## నా పూల తోటలో!

నా పూల తోటలో! నవభక్తి కుసుమ మది!
చిన్ననాడే పూచె వన్నెలొలుకగనూ!
నను వీడ దెపుడునూ నవ్య రాగాలతో!
కలిసి యుండునె చెలియ! కనిపింప దెప్పుడును!

నా పూల తోటలో నవభక్తి కుసుమ మది!
చిన్ననాడే పూచె వన్నె లొలుకగనూ!

వన్నెలను దలపించు! వాసనలు గురిపించు
అందాల రాగాలు నాలపించునె చెలియ!
ప్రభువు నీ వాదనే ప్రేమ పుట్టించునే!
కలవరము గలిగించు కలలందు గూడ చెలి! ॥నా పూల॥

కలలందు గనిపించు కమ్మనీ మురళితో
ముత్యాల దంతతో మురిపాలు గురిపించు!
ఏకాంతమున నుండ ఎందుకో నా విభుడు
మదియందు నిలుచునే మహనీయ కాంతితో! ॥నా పూల॥

ఆ భక్తి కుసుమమే యలరి వికసించెనే
వేయి రేకలతోని వేడుకను మదియందు!
ముద్దు గోపాలునీ మురిపెగ నా భక్తి
విభునిగా సఖునిగా వేడుకను జేసినది!

నా పూల తోటలో నవభక్తి కుసుమ మది!
చిన్ననాడే పూచె వన్నె లొలుకగనూ!

# నావికుడు లేనట్టి

నావికుడు లేనట్టి నావలో గోపాల!
బరగ నిను బిలుచుచూ పయనించుచుంటి!

ఒడిలోని పువ్వులను వరుసగా నొక్కొకటి
యపురూప భక్తితో నలలపై వొదులుతూ

నా వికుడు లేనట్టి నావలో గోపాల
బరగ నిను బిలుచుచూ పయనించుతుంటి!

ఆవలొడ్డున నున్న యందాల గోపాల!
ఓ యనుచు బలుకవా ఓంకార నాదమున!
నా మధుర గీతమును నీ మురళి నొలుకగా
ఒయలు దేరితిగదా బన్నుగా పడవపై! ॥నా వికుడు॥

అలలలో దడబడుచు తెరలలో నొరుగుచును
సుడులలో దిరుగుచును సోలిపోవుచు నుండె!
కదలివలె సెలయేఋ కనిపించు చుండెనూ!
మెఋపు లుఋములతోని మేఘాలు జెలరేగె! ॥నా వికుడు॥

చిటికె వ్రేలినిబట్టి జేర్చుమా నను దరికి
హృదయమున కద్దుకొని సదయ! వ్యధ దీర్చుమా!
నీ మురళి వినక నే నిముసముండగ జాల!
నీ పాట బాడకను నే నిలువ లేనుగా!

నావికుడు లేనట్టి నావలో గోపాల!
బరగ నిను బిలుచుచూ బయనించుచుంటి!

## మనసు ప్రేముడి యందు

మనసు ప్రేముడి యందు మలుచుకోవలె నంచు
మనసార గోరితిని! మాధవా! నిన్నూ!

దూరాన నిలుచుండి దోబూచు లాడెదవు
దరిజేర రావుగద! దయలు బొంగారగను!

మనసు ప్రేముడి యందు మలుచుకోవలె నంచు
మనసార గోరితిని మాధవా! నిన్నూ!

నిండయిన భక్తితో నిన్ను బూజించితిని!
అంత నీవని దలచి యాత్మార్పణము తోని!
మధుర గీతములతో మది నిన్ను బాడితిని!
కనికరింపవు గదా! కరుణతో గోపాల! ॥మనసు॥

దుర్వాసు శాపమేదో దురితమది మదిగప్పె
నీకు నా భక్తికిని నిజముగా నడ్డొచ్చె!
అందుకే యిటుల నే నారాట బడుచుంటి!
నను మఱచిపోతివీ! నాథ! శాపము వలన! ॥మనసు॥

ఆనాటి దానినీ అందాల గోపికను!
ఆడిపాడినదాన! యపురూపముగ నాడు!
దూరమైతిమి నేడు దురిత మేదో గప్పె!
ఆనాటి స్మృతులన్ని యలరి మఱచితిని గద!

మనసు ప్రేముడి యందు మలుచుకోవలె నంచు
మనసార గోరితిని! మాధవా! నిన్నూ!

## ప్రేమతో బిలిచినా

ప్రేమతో బిలిచినా పిలుపులన్నీ గూడ
గాలిలో కలిసెనని కలత జెందితినీ!

విభుడింక రాడనీ వెతనంది మదిలోన
యారాట బడుచుంటి నది యేమి చిత్రమో!

ప్రేమతో బిలిచినా పిలుపులన్నీ గూడ
గాలిలో కలిసెనని కలత జెందితినీ!

అతగాని భావాలు సంతుబట్టవు చెలియ!
వికసింపజేయునే వెన్నెలా కుసుమాలు!
ఆశలను జిగురించి అందాలు గురిపించి
ఉయ్యాల లూగించు నూహకందని రీతి! ॥ప్రేమతో॥

క్రొత్త రాగాలతో క్రొత్త పాటలు విరియు
మనసులో పొంగునే మహనీయ భావాలు!
చీమలా బారులా సెలయేటి జాలులా
కోకిలల పాటలా కూర్మి చిందులు వేయు! ॥ప్రేమలో॥

మధుర మౌ శ్రుతిలయల మనసులో బాడించు
సరిక్రొత్త గీతమును సరసతను వెలయంచు!
గొంతెత్తి బాడమని కోరి తన మురళినీ
ముందుగా బాడువే మోదమున జెలికాడు!

ప్రేమతో బిలిచినా పిలుపులన్నీ గూడ
గాలిలో కలిసెనని కలత జెందితినీ!

## ఎందుకో గోపాల!

ఎందుకో గోపాల! ఈ విరహ వేదనలు
కనుకొలుకు లందునను కన్నీ రదేలా?

జన్మ జన్మల నాటి జరిగినా కథలన్ని
మనసునకు దెచ్చుకొని మసిలిపోవుట యేల?

ఎందుకో గోపాల! ఈ విరహ వేదనలు
కనుకొలకు లందునను కన్నీ రదేలా?

కమ్మనీ వాసనల కలువపూవుల దండ
మనసార నే గ్రుచ్చి మాధవుని కేసితెని!
చెలువార నను తనదు చెలి యనుచు మెచ్చుకొని
మనసార బలుకుటయు మాధవా! మఱతు నెటు?

ఉరుము లుఱిమిన రాత్రి మెఱుపు మెరిసిన యపుడు
పడవలో నే నలరి పాటపాడిన నిశిని!
నీట మునిగిన పడవ తేటగా తీరమును
జేర్చినా పతివి కద! దీరుగా నెటు మఱతు?

అట్టి గోపాల! విను యెట్లు నే మఱచెదను?
చుట్టు గోడలు యెన్ని కట్టుకొనిననుగూద!
అర్పించితిని నీకు నాత్మ సర్వస్వమును
మన్నించు గోపాల! మనసు విన్నపములను!

ఎందుకో గోపాల! యీ విరహ వేదనలు!
కనుకొలకు లందునను కన్నీ రదేలా?

## పాట నాపగ లేను

పాట నాపగలేను భవ్యమౌ నీభక్తి!
పదము నాపగలేను బరవశించుచునూ!

గుండెలో నీవుండి కూర్మి మురళిని బాడ
ఎటు లాపుదును స్వామి! యీ మధుర గీతమును!

పాట నాపగలేను భవ్యమౌ నీభక్తి
పదము నాపగలేను బరవశించుచునూ!

యెదలోన దాగుండె వేయి శ్రుతిలయలతో
మురళిపాటను బాడ మోదమున నాగళము!
బాడుచున్నది కృష్ణ భవ్యమౌ నీగీతి
మధురాక్షరములతో మాధుర్య పదములను! ॥పాట॥

చిఱు గజ్జియలతోని చిన్నారి పాదముల
మధుర నృత్యము సేయ మదియందు శ్రీకృష్ణ!
ఆడిబాడుచునుంటి యలరి వనవీధులను
వనమయూరికి వోలె వన్నెలను నొలుకుచును! ॥పాట॥

నేను నీ ప్రతిధ్వనిని! నీదు క్రీనీడనూ!
నీ నర్తనము నేను నేర్పుగా నేర్చితిని!
గుండె కోవెల ఝూయె గూర్మి మదుసూదనా!
నీదు క్రీనీడయై నిలిచినది నా తనువు!

పాట నాపగలేను భవ్యమౌ నీ భక్తి
పదము నాపగలేను బరవశించుచునూ!

## నా గమన మేదియో!

నా గమన మేదియో! నా గమ్య మెద్దియో!
నిర్మలంబగు బుద్ధి నే దెలిసికొంటి!

పలుమారు నిను వేడి బాధింపజాలనూ!
కలవోలె భావింతు కాటు చీకట్లని నే!

నా గమన మేదియో! నా గమ్య మెద్దియో!
నిర్మలంబగు బుద్ధి నే దెలిసికొంటి!

అపురూపమైన నీ యందాల దీవిలో
నలరి వసియింపగా నాశ లేమియు లేవు!
భోగముల మునుగుచును భూరిసుఖముల నంద
కోరికయు లేదు గద! గోరంత! రవ్వంత! ॥నా గమన॥

వీధిగాయకిని నై విమల కిన్నెరదాల్చి
విమల గాంధర్వమున విమల గీతిక బాడి
పతిత జీవనుల నిల బావనుల జేయగా
మనసులో నిలిచినది మధురమౌ నీయూహ! ॥నా గమన॥

యాచింపలేను నిను నరవిందనేత్ర విను!
కాచి రక్షింపమని కరుణతో వేడనూ!
ఎందాక నీదయను నందుకొనలేనొ భువి
అందాక మధురముగ యాడి బాడుదు నిన్ను!

నా గమన మేదియో! నా గమ్య మెద్దియో!
నిర్మలంబగు బుద్ధి నే దెలిసికొంటి!

## పాట యెట నుండునో

పాట యెట నుండునో! పరమాత్మ! యుండెదవు
పాట పద్యము వెదుకు పథికుడవు నీవూ!

అందుకే నేర్చితిని యీపాట యాపాట!
విందుగా నేర్చితిని విమల గీతికనూ!

పాట యెటునుండునో పరమాత్మ యుండెదవు!
పాట పద్యము వెదుకు బధికుడవు నీవూ!

సృష్టి యందాలన్ని చోద్యముగ పాటలో
సమకూర్చితివి గదా! సాధు రూపములతో!
శ్రుతిలయల కూడికే చోద్యముగ భువియంత
ఓంకారనాదమే యొసర బ్రహ్మాండంబు! ॥పాట॥

సెలయేటి నాదాలు, ఈలుగాలి సవ్వడులు
వనవీధి కుసుమాల వయ్యారి నాట్యాలు!
చిలుకగోరింకలా చిన్నారి పదములును
కొమ్మపై కోకిలల కుహుకుహూ నాదాలు! ॥పాట॥

విప్రోత్తముల సామ విమలమగు నాదాలు
కడలిలో వినిపించు గంభీర ధ్వనులునూ
మెఱుపులను బ్రబవిల్లు మేఘ ధ్వనులునుగూడ
పాటలను పద్యాల బన్నుగా గూర్చితివి!

పాట యెటనుండునో పరమాత్మ యుండెదవు!
పాట పద్యము వెదుకు బధికుడవు నీవూ!

## అంతరాత్మను జేరి

అంతరాత్మను జేరి యలరినా శ్రీకృష్ణ!
కుదురుగా గాంచెదను జెదరకను మనసూ!

అందాలు గూర్చితిని యపురూపముగ నీకు!
ఏలోకమున లేని యింపయిన సొగసులను!

అంతరాత్మను జేరి యలరినా శ్రీకృష్ణ!
కుదురుగా గాంచెదను జెదరకను మనసూ!

అపురూప శిల్పమును నలరి దా నిర్మించి
మఱల మఱలను గాంచి మది సంతసించునటు!
నా హృదయ కుటియందు నవరత్న శోభలను
నిన్ను నిర్మించితిని నీటుగా గోపాల! ॥అంతరాత్మను॥

అపరంజి రంగులను నా చిత్రకారుడును
మానసము వికసింప మధురముగ దా వ్రాసి!
తన్మయత్వము జెంది దా మురియునటుల నే!
నిను జూచి మురియుమచు నింగియెత్తున కృష్ణ! ॥అంతరాత్మను॥

కవిశేఖరుడు గీతి కమనీయముగ వ్రాసి
ఆనందమును జెంది యలరునటు నేనును!
నీ యంద చందములను నిర్మలాత్మను గాంచి
చూపు జెదరక జూతు! సుందరాకృతిని నే!

అంతరాత్మను జేరి యలరినా శ్రీకృష్ణ!
కుదురుగా గాంచెదను జెదరకను మనసూ!

# అలరి దోసిలి పట్టి

అలరి దోసిలిపట్టి యాచింపగా లేదు!
అల రాజులను మహారాజులను నైనా!

ఆంజలిని బట్టి నిను యాచించితి నిక్రృష్ణ!
నాదు సర్వస్వమని నమ్మి నా మదియందు!

అలరి దోసిలిబట్టి యాచింపగా లేదు!
ఆలరాజులను మహారాజులనునైనా!

చిగురుటాకులు మేసి చిత్రముగ మావిపై
మంజులంబుగ బాడు మధురకోకిల వోలె
మధురాక్షములతో మాధుర్య గీతికను
నిన్ను మెప్పించితిని నీరజాక్షా! నాడు! ॥అలరి॥

రాలినా పూవులను రతనాల మాలగా
నర్పించితిని జేర్చి యాత్మార్పణంబుగా!
జారినా మందార మాధుర్యముల దెచ్చి
సరసిజాక్షా! నీకు దగ కాన్క లొసగితిని ॥అలరి॥

పరుల యాచించి నే పరిమళంబుల దెచ్చి
పూజింప లేదుగద! పూర్ణపురుషా! నిన్ను
మనసులో విరిసినా మంజులంబగు గీతి
బాడి పూజించితిని! పరమపురుషా నిన్ను!

ఆలరి దోసిలిబట్టి యాచింపగా లేదు!
ఆల రాజులను మహా రాజులను నైనా!

## కంటి పాపకు వోలె

కంటిపాపకు వోలె గాపాడు చుందువని
జంట యెపు డుందువని కంటగన లేనైతి!

తీయనీ నీ ప్రేమ దేనెలను గుతిపించి
దీరుగా నుందువని తెలియజాలకపోతి!

కంటిపాపకు వోలె గాపాడు చుందువని
జంట యెపుడుందువని కంటగన లేనైతి!

నా ముందు నడుచుచును నవశ్రీలు దొలుకుచును
అందాల నడకలను నలరిబోదు వటంచు!
చెన్నుగా నావెనుక చెలునివలె బయనించి
కరుణింతువని నిన్ను గానజాలక పోతి! ॥కటిపాపకు॥

మెత్తనీ పాదముల యొత్తిగిలి బ్రక్కలకు
మిట్ట పల్లములందు మేలుగూర్చుచు నాకు!
అడుగడుగు గదిగేటి యాపదల రక్షింది
యాదుకొను స్వామివని యరయలేకను బోతి! ॥కంటిపాపకు॥

నా భక్తి ప్రేమలమ నయముగా నందగా
నా మధుర గీతముల నాథ వినగా గోరి
బొంచి యున్నాడవని బొందుగా నీ రాక
వెంటబడు చుంటివని కంటగన లేనైతి!

కంటిపాపకు వోలె గాపాడు చుందువని
జంట యెపుడుందువని కంట గనలేనైతి!

## మఱచిపోలేదు నను

మఱచిపోలేదు నను మాధవుడు చెలియరో!
మనసులో దలచునట! మమత విరియగనూ!

చిలకమ్మ దెలిపినది చిత్రమగు శుభవార్త
కమ్మనీ వార్తలను కలహంస దెలిపినది!

మఱచిపోలేదు నను మాధవుడు చెలియరో!
మనసులో దలచునట! మమత విరియగనూ!

దూరాన నుంటినని దురపిల్లుచుంటినని
అన్ని దెలియునటంచు నాతడే దెలిపెనట!
తనుగూడ నావోలె దపియించు చుండెనట!
తగు సమయమున దాను దరలి వచ్చేనంట! ॥మఱచి॥

అన్ని తానే నంట! యవని యంబరములును
ప్రతి జీవిలో దాను ప్రతిబింబమే నంట!
కన్నారగాంచె దా కనిపింతుననియె నట
విరహమేల నటంచు వివరించినాడంట! ॥మఱచి॥

చివురులో పూవులో చిత్రమగు ప్రకృతిని
అన్నిటను దానుండి యలరునట! శ్రుతిలయల!
మురళి నూదుచు నుండు మురిపెముల గానకను
దూరాన నుంటినని మరపిల్లు టెందుకనె!

మఱచిపోలేదు నను మాధవుడు చెలియరో!
మనసులో దలచునట! మమత విరియగనూ!

## ఆడుకో గోపాల!

ఆడుకో గోపాల! అందాల నా హృదిని
చిఱుగజ్జియలతోని శ్రీ మురళి తోసీ!

నే గాంచుచుందుమా నిర్మలంబగు మదిని
ఆనందము ను జెంది నటు దేలు చుండెదను!

ఆడుకో! గోపాల! అందాల నా హృదిని
చిఱు గజ్జియలతోని శ్రీ మురళి తోసీ!

అలమందల యందు నటుదిరుగు చుండుటయు
గోపబాలుర తోని గూడి యాడుటయునూ!
కొండకోనలయందు గూడి శ్రీ మురళితో
పాటబాడుట గూడ టరికించు చుండెదను! ॥ఆడుకో॥

అల గోపికలతోని నాడి బాడుటయునూ
రాసక్రీడలయందు రమ్య నృత్యములతో!
నే నొక్క గోపికను నీతోని జతగూడి
ఆడిపాడిన దాన! అందాల గోపికను! ॥ఆడుకో॥

నను మఱచిపోతివి! నాథ! శ్రీ గోపాల
నాటి కథలన్నియును రమణీయములనూ!
నే మఱచిపోలేదు నిర్దయా! శ్రీకృష్ణ!
నా మనసునకు వచ్చి కలిపివేయుచునుండె!

ఆడుకో! గోపాల! అందాల నా హృదిని
చిఱు గజ్జియలతోని శ్రీ మురళి తోసీ!

# ఇంత ప్రేమని నేను

ఇంత ప్రేమని నేను యింతయిన యెఱుగనూ!
కాంతులనకు నా పైని గలదో తెలిసినదీ!

ఆనాడు గుర్తయిన యంతపని జరుగునా?
వేఱుబడి పోదునా? విడిపోయి యుందునా?

ఇంత ప్రేమని నేను యింతయిన యెఱుగనూ!
కాంతునకు నాపైని గలదో తెలిసినదీ!

మననుతో నను దలచి మఱి క్రుంగి పోవునట!
ఎదుట నున్నటుల నను నింపుగా బిలుచునట!
వేణువున తన విరహ వేదనను బలికించి
కను మూసి లోలోన గాంచునట నా రూపు! ॥ఇంత॥

సంజ కాంతులయందు సరసగీతిక యందు
ననుగాంచు చుండునట! నా రూపురేఖలను!
చేర వచ్చిన హంస చిలుక గోరింకలను
చెలి నిచట నిలుపుదని చెలువార గోరునట! ॥ఇంత॥

కలిసిపాడిన పాట కరుణతో స్మరియించి
చందమామను జూచి చలియించునట విభుడు!
రాసక్రీడలనాటి రమణీయ దృశ్యముల
కనులలో జేర్చుకొని కన్నీరు నింపునట!

ఇంత ప్రేమని నేను యింతయిన యెఱుగనూ
కాంతునకు నాపైని గలదో తెలిసినదీ!

## పాటతోనే గదా !

పాటతోనే గదా! పరమపావన నిన్ను
శ్రీమంతులును గూడ జేరగలిగిరిగా!

పాటతోనే నిన్ను బలవశము జేసిరీ
పాటతోనే గూడ! పరము నందుదుమా!

పాటతో నే గదా! పరమపావన నిన్ను
శ్రీమంతులును గూడ జేరగలిగిరిగా !

అల ద్రౌపదియు గూడ యరవిందనేత్ర! నిను
పాటతోనే గదా! బరగ మెప్పించినది
మానమును గాపాడి మఱి వలువలను నిచ్చి
కరుణ జూపితివి గద! కారుణ్యనిధి నాడు!

అల గజేంద్రునకు మఱి యార్తి బాపితివి గద!
జాలిగా బాడినా స్మరణ గీతంబునను
బాలుడగు నా ధ్రువుని పల్లవిని విని గదా!
పరమ పదమును నిచ్చి భద్రమును గూర్చితివి

అల వ్యాస వాల్మీకు అందముగ బాడినా
పాటనే గద స్వామి! బాడుచుంటిమి నేడు!
అందుకే నే పాట యలరి నేర్చితి స్వామి!
నీ దయను బొందగా నేర్పార భక్తితో!

పాటతోనే గదా! పరమపావన నిన్ను
శ్రీమంతులును గూడ జేర గలిగిరిగా!

## కథ నొకటి దెలిపెదను!

కథ నొకటి దెలిపెదను కల్యాణ గుణధామ!
"ఊ" యంచు దలనూపి యూహింపు వ్యథనూ!

మురళి నావలనుంచి మోదమున వినవోయి!
కన్నీటి గాథనూ! కరుణరస భరితమును!

కథ నొకటి దెలిపెదను! కల్యాణ గుణధామ!
"ఊ" యంచు దలనూపి యూహింపు వ్యథనూ!

చిగురాకు తనమందె చిన్నారి పొన్నారి
నిను మదిని దలచినది నిండారు ప్రేమతో!
వేడుకొనుచున్నదీ! పాడుకొనుచున్నదీ!
పరిమళపు కస్తూరి పాటతో నీ దాని! ॥కథదొకటి॥

కోకిలను జతగూడి కూర్మి గీతములనూ
చిలుకలను జతజేరి చిత్రమౌ పలుకులను
ఏ పాట బాడినా! యే బలుకు బలికినా
నినుగూర్చి భక్తితో నిరతమును స్మరియించుచు ॥కథ నొకటి॥

బహుళ చంద్రునివోలె బడలి పోయినదోయి!
పండుటాకుకు మల్లె పడి రాల నున్నదీ!
తొంగి జూడగ మద! దోరంపు ప్రేకుతో
యరసి ప్రోవగరాద! అందాల గోపికను!

కథ నొకటి దెలిపెదను కల్యాణ గుణధామ!
"ఊ" యంచు దలనూపి యూహింపు వ్యథనూ!

## ఎంత తీయని పాట!

ఎంత తీయని పాట! ఎంత తీయని మురళి!
వింతగా వినిపించె! కాంతరో! గతరాత్రి!

మబ్బులో తేలినటు మమతల్లో మునిగినటు
పక్షిలా నింగిలో బరువెత్తినటు తోచె!

ఎంత తీయని పాట! ఎంత తీయని మురళి!
వింతగా వినిపించె! కాంతరో! గతరాత్రి!

సంధ్య కుంకుమలన్ని సఖియ ప్రోవుగ జేసి
నా మనసు పేటికను నయముగా నుంచినటు!
వెన్నెలా మొలకలను చిన్ని పూదండగా
యెదపైని దాల్చినటు మది పొంగెనే సఖీ! ॥ఎంత॥

మలయ మారుతమంత కలిసినా తనువంత
ఉయ్యాల యూపినటు నూహ కనిపించెనే!
చుక్కలను నేనొక్క చుక్కనయి నింగిలో
మిలమిలల కాంతులను మెరసినటులనిపించె! ॥ఎంత

కలగాదు నిజమిదీ గతరాత్రి యంతయును
వినిపించె విభుడు నా వీనులకు విందుగా
నను సుధల ముంచుటకు నన్ను హాయి దేల్చుటకు
తెలవార్లు శ్రీమురళి దీరుగా మ్రోగించె!

ఎంత తీయని పాట ఎంత తీయని మురళి!
వింతగా వినిపించె కాంతరో! గతరాత్రి!

## కొండలను కోనలను!

కొండలను కోనలను కోనేరు లన్నియును
వెదుకుచుంటిని కృష్ణ! వేయి కన్నులుగా!

కనిపింపవుగదా కమనీయ రూపాన
విమలమగు సరసులను నమల వనవీధులను

కొండలను కోనలను కోనేరు లన్నియును
వెదుకుచుంటిని స్వామి వేయి కన్నులుగా!

కలువ పదములతో కలకలా తొలికేటి
విమలమగు సరసులను నమల వన వీధులను
భక్తి భావముతోని భవ్య దేవళములను
పరితపించుచు నిన్ను భక్తి వేడుచునుంటి!

మధుర ప్రకృతినంత మాటి మాటికి వెదికి
నిను గాంచగా మదిని నిశ్చలంబగు భక్తి
మధుర గీతంబులను మంజులంబగు రాగ
తాళ శ్రుతి లయలతో దగ బాడుచుంటినీ!

అంతటా నిండినా యాత్మేశ్వరుడవీవు
నీవు లేనిది జగతి నిజముగా లేదనుచు
ఎటజూడ నచటనే గనిపింతు వనుచున్నూ
బటుశాస్త్ర కోవిదులు బరగ దెలిపిరి నాకు!

కొండలను కోనలను కోనేరు లన్నియును
వెదుకుచుంటిని స్వామి వేయి కన్నులుగా!

## విరబూసిన మల్లియలుగ!

విరబూసిన మల్లియలుగ విమలమైన భావములను
మాలగ నే గూర్చుచుంటి మాధవ! నిను మది దలంచి!

కొండవాగు జలధారలు కూర్మి శిలల దొరలు నటుల
నా సుగీతి నీ పదముల నాట్యమాడుచుండు నటుల

విరబూసిన మల్లియలుగ విమలమైన భావములను
మాలగ నే గూర్చుచుంటి మాధవ! నిను మదిదలంచు!

బాల సూర్య కిరణమువలె
పల్లవించు నా గీతము
వెన్నెల జాలుకు వోలెను
విమల కాంతు లొలుకుచుండు! ॥విరబూసిన॥

అప్సర గగనమున నుండి
అలరి భువికి దిగిన యటుల
నా గొంతున మధుర గీతి
నాథ! మ్రోగు నలు దిశలను! ॥విరబూసిన॥

నీ మురళీ ధ్వనియించిన నిర్మలమగు ధ్వనులేకద!
నా హృదిలో వినిపించెను నవతంత్రీ సుస్వనములు!
విశ్వమంత నిండినదీ విమలమైన సుందరమూ
నాలో శివముగ నుండీ నాట్యమాడుచుండె స్వామి!

విరబూసిన మల్లియలుగ విమలమైన భావములను
మాలగ నే గూర్చుచుంటి మాధవ!నిను మది దలచీ!

## వెదికి నిను బొందితిని!

వెదికి నిను కనుగొంటి వేయి వీధులయందు
ఇల్లిల్లు దిరిగితిని కల్లగాదోయీ!

పట్టుబడితివి నాకు చెట్టు పుట్టల యందు
కొండశిఖరము పైని కోనేరు దరిపైని!

వెదికి నిను గనుగొంటి వేయి వీధులయందు
ఇల్లిల్లు తిరిగితిని కల్లగాదోయీ!

ఎన్ని జన్మలనాటి బంధమిది పరమాత్మ
సన్నిహిత సంబంధ సఖ్యమిది గోపాల
నను మఱచిపోయినా నిను మఱువలేదు గద
గుర్తించితిని నిన్ను గోపాల నీరూపు! ॥వెదికి నిను॥

చెలికాంక్ష వీక్షించి జేరదీయుము స్వామి
జన్మజన్మల నాటి కర్మముల దొలగించి
జ్యోతితో జ్యోతివై ప్రీతి విలసిల్లగా
మురళీస్వనములందు మోదముగ కలిపికొను! ॥వెదికి నిను॥

వెదికి నిను గనుగొంటి వేయివీధులు దిరిగి
ఇల్లిల్లు దిరిగితిని కల్లగాదోయీ!
మురళి దాచెదవేల మోదముగ నూదగా
ఆలనాటి రాగధ్వని యాలపింపుము స్వామి!

నా విరహగీతమును నావిరహ వేదనను
వినిపింతునో స్వామి వీనులకు విందుగా!

## నీలి మేఘమునందు

నీలి మేఘమునందు నిలిచినా రెక్కవలె
నీ హృదయ సీమలో నిలిచిపోనీవా?

ఆకాశవీధిలో అందాల హరివిల్లు
అతికినా దీరుగా నతికిపోనీవా?

నీలి మేఘమునందు నిలిచినా రెక్కవలె
నీహృదయ సీమలో నిలిచిపోనీవా?

నీ వైజయంతిలో నేనొక్క దళమునై
కమ్మనీ వాసనల కలిసిపోనీవా?
నీ వెలుగు దీపికను నేనొక్క కిరణమై
కాంతిలేఖగ నన్ను కరుణింపలేవా? ॥నీలి॥

నీచైత్ర వనవీధి నీపూల తోటలో
నన్నొక్క భ్రమరముగ నర్తింపనీవా?
తీయనీ గాత్రాన తేనె లొలికించేటి
కోకిలగ ననుజేసి కోర్కె దీర్పగరాద! ॥నీలి॥

మధుర మురళీనాద మాధురిని నాగీతి
నుయ్యాల లూగించి యూహలను దేల్పవా?
శీర్షమున కరముంచి శ్రీమురళిలో జేర్చి
చిననాటి నాకోర్కె జిగురింపనీవా?

నీలి మేఘమునందు నిలిచి నారెక్కవలె
నీహృదయ సీమలో నిలిచిపోనీవా?

## జాజిపూల పొదరింటిని

జాజిపూల పొదరింటిని జపతపముల జేయుచుంటి
కిన్నెర మ్రోగించుచునూ కీర్తనలన బాడుచునూ

సిరాకకు నెదురుచూచి
నిర్మలమగు భక్తితోని
రాగమాలికను యిదిగో
రమ్యముగా నల్లుచుంటి!

జాజిపూల పొదరిందిని జపతపముల జేయుచుంటి
కిన్నెర మ్రోగించుచునూ కీర్తనలనూ బాడుచునూ!

ఆకాశపు మల్లియలను
అలరిమాలగా జేర్చుచు
మధురభక్తి కుసుమాలను
మంజులముగ గూర్చుచుంటి! ॥జాజిపూల॥

మెత్తని నీపాదము లివి
యొత్తుకొనునో యనుచు దలచి
మల్లెల బఱచితి వాకిట
మాధుర్యము జిందులాడ! ॥జాజిపూల॥

ఎన్నాళ్ళీ పొదరింటిని
విమల గీతముల బాడుచు
శబరికివలె ఎదురుజూతు?
శాంతి గూర్పు పరమాత్మా!

జాజిపూల పొదరెంటిని జపతపముల జేయుచుంటి!

## అన్వేషించుచు నుంటిని

అన్వేషణ జేయుచుంటి యాత్మబంధు వని దలచీ!
దివి భువి విశ్వాంతరములు దీరుగ యణువణువుననూ!

గతకాలపు బాంధవిగా
కమ్మని తీయని ప్రేమను
కర్మ బంధములు దొలగగ
కరుణ జూతువని దలతును!

అన్వేషించుచు నుంటిని యాత్మబంధువని దలచీ
దివిభువి విశ్వాంతరములు దీరుగ యణువణువుననూ!

కొండలలో, కోనలలో,
కూరిమి వన వీధులలో
అంబరమున తారకలను
అలరి ఉదయ సంధ్యలనూ! ॥అన్వేషిలతుచు॥

గిరి శిఖరపు టంచులలో,
కిన్నెర ప్రమోగించుచునూ!
మధురగీతి తోని కృష్ణ
మమత బిలుధుచుంటి కృష్ణ! ॥అన్వేషించుచు॥

అణువణువున నున్న నీవు నలరి బలుక వెందుకనీ?
మనసువిప్పి మాటాడవు! మౌనము వీడవు! ఎందుకు?
ఎన్నాళ్ళీ యన్వేషణ? ఎంతకాల మీ విరహము?
మడి బూచిన మల్లెపూల మమత స్వీకరించువా?
ఎన్నాళ్ళీ యన్వేషణ?

## చిమ్మ చీకటి యందు

చిమ్మచీకటి యందు జెరగనీ వేదనను,
కన్నీరు రాల్చేటి కమనీయ గోపికను!

చిన్నికృష్ణుని కౌఁగిలికి చిరకాల వేదనను
మధురగీతిక బాడు మాలతీ లత నేను!

చిమ్మచీకటి యందు జెరగనీ వేదనను
కన్నీరు రాల్చేటి కమనీయ గోపికను!

ఎవరులేనట్టి యీ యేకాంతమందునా,
కొండ కోనలలోని కోనేటి జాలునా!
ఎవరు లేకుండగా నెట్టి సవ్వడి లేక
మౌనముగ బాడేటి మధుర గోపిక నేను! ॥చిమ్మచీకటి॥

చీకటుల తెరలలో జెరగని వేదనను
నాలోనె లోలోన నలిగి శోకించెదను!
కలువ తామరలున్న కమనీయ సరసులను
ఒంటరిగ తీరముల కంటినీరొలుకుదును! ॥చిమ్మచీకటి॥

మధుర గోపికయనుచు మఱి జనులు బలిచెదరు
వేదనా రూపి నను వినదుగద! యీ జగతి!
నవనీత కృష్ణుపై నళినాక్షి! విరహిణిగ
ఉల్లమది చెదిరినా యుత్పలాక్షి నటించు!

చిమ్మచీకటి యందు జెదరనీ వేదనను,
కన్నీరు రాల్చేటి కమనీయ గోపికను!

## మౌనవేదన వినవు!

మౌనవేదన వినవు! మాటాడ వించుకయు
వేడి నిట్టూర్పులను వెస జూడ వెందుకో!

కొండెత్తు కన్నీరు గూర్మితో బరికించి
వాంఛ దీర్పవుగదా వన్నెలాడా నాదు!

మౌనవేదన వినవు! మాటాడ వించుకయు,
వేడి నిట్టూర్పులను వెస జూడ వెందుకో!

కాటుకను కన్నీరు కలిపి వ్రాసితి లేఖ
మేఘమాలను, బిలిచి మేల్మి కానుక లిచ్చి!
కబురంపితిని గదా కమనీయ గీతితో!
రావేల నా స్వామి? రమ్యమగు నీరేయి! ॥మౌనవేదన॥

చిలుక గోరింకలను జత జేసి బంపితిని!
హంసదంపతులనూ యలరి బంపితి గదా!
నీ పాద సన్నిధిని నిర్మలంబగు భక్తి
నా గీతి వినిపింప నాథ! కోరిక యనుచు! ॥మౌనవేదన"

ఏనాటి బంధమిది? యేనాటి విరహ మిది?
అలనాటి వ్రేపల్లె నలరినా బంధమిది?
నను మఱచినా గూడ నిను మఱువ లేదోయి!
జన్మ జన్మల భక్తి జారిపోలేదోయి!

మౌనవేదన వినవు! మాటాడ వించుకయు
వేడి విట్టూర్పులను వెసజూడ వెందుకో!

## ఆలనాటి వెన్నెలల

అలనాటి వెన్నెలల నాడితిమి బాడితిమి!
ఆ శరత్కాల మిదె! యరుగుదెంచినదీ!

చిగురాకు జొంపముల చిత్రమగు వనవీథి
మాధవా నిలిచినది మనసునను నేడూ!

అలనాటి వెన్నెలల నాడితిమి బాడితిమి!
ఆ శరత్కాల మిదె యరుగుదెంచినదీ!

తెల్లనీ చంద్రునీ చల్లనీ సొగసులను
తియ్యనీ సెలయేటి తిన్నెలకు నాడుచును!
మధుర గీతాలతో మాధవా! యానాడు
ఆడినది బాడినది యంతయును మతికొచ్చె! ॥అలనాటి॥

చెఱకుగడ విల్లుగా జేపట్టినా నీకు
రెల్లుపూవుల శరము నందింపగా నేను!
రతిమన్మథుల వోలె రాజిల్లితిమి నాడు!
రమణీయ దృశ్యమది రంజిల్లె కన్నులకు ॥అలనాటి॥

ఆ శరత్కాల మిదె! యా వెన్నెలలు యివే!
ఆ కలువ పద్మాలు అందాలు యివి! యివే!
పరదేశమున నుంటి బరగ నిను బలుచుచును
ఈ విరహ మెన్నాళ్లు! నెపుడు గలియుదుమో!

అలనాటి వెన్నెలల యాడితిమి! బాడితిమి!
ఆ శరత్కాల మిదె! యరుగు దెంచినదీ!

## మధురాతి ఫలములను

మధురాతి ఫలములను మందార కుసుమాలు
మాధవా దెచ్చితిని మనసు బొంగారా!

కలువ తామర పూలు గంగ నీటి కొలనులో
జలములను దెచ్చితిని జలజాక్ష నీ కొఱకు!

మధురాతి ఫలములను మందార కుసుమాలు
మాధవా దెచ్చితిని మనసు బొంగారా!

నా గుండెలో నున్న నవభావముల తోని
మధుర పదములతోని మాల గ్రుచ్చితినీ
అర్పించితిని నీకు ఆనందమొప్పగా
స్వీకరించెద వనుచు శీఘ్రముగ గోపాల! ॥మధురాతి॥

మధుర ఫలముల గొనవు మందార కుసుమాలు
ధరియింప వెందుకో దర్శనీయముగాను
నా మధుర గీతమే నయముగా గైకొనుచు
పాడుకొందువు మిగుల పారవశ్యము జెంద! ॥మధురాతి॥

మధుర ఫలముల నేల? మందారములు నేల
కలువతామరలున్న కమ్మనీ జలమేల?
నాకు నచ్చిన గీతి నయముగా దెచ్చితివి
అనుచు బలికితివి గద! యానాడు శ్రీకృష్ణ!

మధురాతి ఫలములను మందార కుసుమాలు
మాధవా దెచ్చితిని మనసు బొంగారా!

## విరహ గీతములతో

విరహ గీతములతో వినువీధి నింపితిని
కన్నీటి ధారలను కలికి ధర దడిపితిని!

రాడాయెగద స్వామి రమణీయ మురళితో
ఆదరింపడు గదా యతివ నా విన్నపము!

విరహ గీతములతో వినువీధి నింపితిని
కన్నీటి ధారలను కలికి ధర నింపితిని!

విరహ గీతములతో విమల గగనమునందు
పక్షులన్నీ చెదిరి బహు త్రోవలను బోయె
మేఘ మాలయుగూడ మిగుల నాశ్చర్యమున
యుఋములని భ్రమజెంది యుసురుసురు మనుచుండె! ॥విరహ॥

కన్నీటి భాష్పముల కథకాదు ఓ చెలియ
కావడిని మోసి నే కదలి గలుపుచునుంటి
కడలిలో ముత్యాలు గాఋనలుపుగ మారె
తెల్లనీ శంఖాలు నల్లనీ రూపాయె! ॥విరహ॥

ఇంత జరిగిన గూడ సుంతమనసూ మారి
ఆదరింపడుగదా అతి ప్రేమతో స్వామి
మురళీ స్వనంబులను ముద్దుగా బాడుచును
నను జేర్చుకొనడు గద నాతి యేమందునే!

విరహ గీతములతో వినువీధి నింపితిని
కన్నీటి ధారలను కలికి ధర దడిపితిని!

## మనసునందు చిన్నికృష్ణ!

మనసునందు చిన్నికృష్ణ మఱి మఱి నే దలచుచుంటి
మాట మాత్రమైన పలికి మన్నింపవ దెందులకో!

కన్నులందు నిన్ను నిలిపి
జెన్నుగ తీయని పదముల
విన్నవించుచుంటిగదా
విమలమైన గీతములచు!

మనసునందు చిన్నికృష్ణ మఱి మఱి నే దలచుచుంటి
మాట మాత్రమైన బలికి మన్నింపవ దెందులకో!

మధురమైన నాదు మదిని
మాలిన్యము దొలగద్రోసి
వెన్నెల గురిపింపు మనుచు
వేడుచుంటి గద స్వామీ! ॥మనసునందు॥

దివ్యమైన నీదు మురళి
తీయని స్వనముల యందున
తీరుగ నా గొంతు కలిపి
తీపిపాట పాటనిమ్ము! ॥మనసునందు॥

మనసులోని నా కోరిక మఱి నిజమగువ స్వామీ
యుగయుగాల నావేదన దగ దూరము బోయేనా?
నావ దరికి జేరేనా? నవనీతా నీ కరుణను
మమతతోని జేరదీసి మల్లెల గురిపించేవా?

మనసునందు చిన్నికృష్ణ మఱి మఱి నే దలచుచుంటి
మాట మాత్రమైన పలికి మన్నింపవ దెందులకో!

## పాడించితివి నన్ను

పాడించితివి నన్ను బరవశము జెందగా
ఆడించితివి నన్ను అల గోపికనుగా!

తేలించితివి నన్ను తీయనీ సుధలలో
భావింపజేసితివి బవ్యాను భావముల!

పాడించితివి నన్ను బరవశము జెందగా
ఆడించితివి నన్ను అల గోపికనుగా!

నీ మురళి మ్రోయించి నీ సుధల జిందించి
మధుర కంఠము నిచ్చి మటి బాడ నేర్పితివి
మధురాక్షరములతో మందార భావాల
తీయతేనియ పాట దీమగా నేర్పితివి! ॥పాడించితివి॥

కొండ కోనలయందు కోర్కెతో ద్రిప్పితివి
ఆకాశ మార్గాన యలరింప జేసితివి
సెలయేటి కన్నెలను జేర్చి బాడించితివి
వనవీధులన్నిటిని వరుసగా ద్రిప్పితివి! ॥పాడించితివి॥

నీవు నే నొక్కటయి సీటుగా దిరిగితిమి
విమలమౌ సరసులను ఏనువీధి తారకల!
ఇపుడు విడిపోవుట టది విపరీతమౌ గాద!
నను విడువ బోకోయి నాథ నే విడిచినా!

పాడించితివి నన్ను బరవశము జెందగా
ఆడించితివి నన్ను నల గోపికనుగా!

## మఱచి పోయితినోయి!

మఱచి పోయితినోయి మాధవా! నీ స్మృతిని
మన్నింపవా నాదు మనసు దప్పదమూ?

తీయనీ నీ మురళి తేనెలను గ్రోలకను
తిరుగుచుంటిని నేను తీరనీ కోరికల!

మఱచి పోయితినోయి మాధవా నీ స్మృతిని
మన్నింపవా నాదు మనసు దప్పిదమూ!

అలలలో తెరలలో నల గాలి సుడులలో
నావికుడు లేనట్టి నావవలె నే నుంటి
పక్షివలె గగనాన బరుగులెత్తుచు నుంటి
గమ్యమది మెచటికో కథయెటుల ముగియునో! ॥మఱచి॥

ఆలించు పాలించు నానంద మూర్తివి
ఆడించు బాడించు నాత్మబంధువు నీవు
అడుగడుగునా నన్ను యతి రమ్యమార్గాన
నాట్యాలు జేయించి నడిపించు సారథివి ॥మఱచి॥

జరిగినా రోజులిక సరసతను రావుగద
ఇపుడైన నాస్వామి వీడి నను చనబోకు
శిథిలమైనా నాదు జీర్ణమందిరమందు
కొలువుండుమా స్వామి కోటి వందనములివె!

మఱచిపోయితినోయి మాధవా నీ స్మృతిని
మన్నింపవా నాదు మనసు దప్పిదమూ

## మతి మఱపు గలిగినది!

మతి మఱపు గలిగినది మాధవా నీ పాట
మసక మసకాయె నీ మధురమగు రూపూ

నీ మురళి స్వనములును నిర్మలంబగు ధ్వనులు
వినిపింపవాయె గద వీనులకు మధురముగు

మతి మఱపుగలిగినది మాధవా నీ పాట!
మసక మసకాయె నీ మధురమగు రూపూ!

అంగాంగములు మిగుల యలసటను బొందినవి
మనసు శిధిలంబాయె మాధవా నిను బిలువ
కలత కలవరములను గ్రాగుచుంటిని స్వామి
వేడి నిట్టూర్పులను నీరసించుచు నుంటి! ॥మతిమఱపు॥

నీ కార్యముల నేను నెరవేర్పలేదు గద!
బరగ నీ యాజ్ఞలను బరిపూర్తి జేయకను
ఎటనుండి వచ్చెనో యీ నలత యీ కలత!
కరుణింపు స్వామి నను కార్య నిర్వాహకుగ ॥మతిమఱపు॥

నే గోరుటయు లేదు నిజ కోరికల స్వామి
అందాల ద్వీపాల యాడుటకు బాడుటకు!
నీవు నేర్పిన పాట నిఖిల జనులకు నేను
అందింపగా కోర్కె అంత మాత్రము స్వామి!

మతి మఱపు గలిగినది మాధవా! నీ పాట
మసక మసకాయె నీ మధురమగు రూపూ!

## కలిసి నాలో నున్న

కలిసి నాలో నున్న కమనీయమూర్తి! నిను
గలుపుకొనుమని యెటుల గలహింతు కృష్ణా!

తీయగా నాహృదిని దీరుగా బాడు నను
మధుర మురళిని బాడమని యెటుల గోరుదును?

కలిసి నాలో నున్న కమనీయమూర్తి నిను
గలుపుకొనుమని యెటుల గలహింతు కృష్ణా!

కలిసిపాటను బాడ కమనీయ రాగాన
పాడుకుందును స్వామి పరిమళింపగ బ్రతుకు
నిఖిల ప్రపంచంబు నీ రూపమే యనుచు
విమల గీతము బాడి విప్పారుదును స్వామి! ॥కలిసి నాలో॥

నవ్వుతూ నాలోని నాథ! నిను గనుగొందు
అణువణువు నందునను నాత్మేశ్వరుండవని
చిపురులో పూవులో చిత్రముగ నిను జూచి
మనసులో నిను జూచి మహిమ గనుగొందునూ! ॥కలిసి నాలో॥

ఎన్ని జన్మలకైన తిన్ననీ భక్తితో
మనసు పరిమళమునను మాధుర్యములు నింపు
కలిసి నాహృదయాన కమ్మనీ రాగాల
మధురగీతముబాడ మాధవా కరుణింపు!

కలిసి నాలో నున్న కమనీయ మూర్తి! నిను
కలుపుకొనుమని యెటుల గలహింతు కృష్ణా!

## కనిపించినా గూడ

కనిపించినా గూడ కమ్మనీ రూపాన
దర్శింపలేదుగా ద్వారమున చెలియా!

అమ్మ! బువ్వా! యనంచు యడిగినా బాలకుని
కసిరి నే బొమ్మంటి కలకల నవ్వుచును

కనిపించినా గూడ కమ్మనీ రూపాన
దర్శింపలేదుగా ద్వారమున చెలియా!

వడిచంక నెత్తుకొని వన్నెలా బాలకుని
ఆసనంబును నిచ్చి యర్చింపలేదుగా!
పాలు చిటి బెల్లమును కలిపి యన్నమునందు
అందింపలేదుగా యలరి యా బాలునికి ॥కనికరించినా॥

చేతిలోపలి మురళి చెయిజాపియందుకొని
హత్తుకొనలేదుగా నంతరంగమునందు
నా విరహ గీతమును నయముగా వినిపించి
జన్మ జన్మల చెలిమి జతజేయలేనుగా! ॥కనిపించినా॥

నా కృష్ణుడని మదిని నాటి దెలియకపోతి
బిచ్చగా డనుచు నే బిరబిరా బొమ్మంటి
చేరవచ్చిన విభుని తెలియజాలకపోతి
మాణిక్యమును సఖియ మసిబొగ్గు అనుకొంటి

కనిపించినా గూడ కమ్మనీ రూపాన
దర్శింపలేదుగా ద్వారమున చెలియా!

## ఊహలకు అందనీ

ఊహలకు అందనీ యున్మత్తు రాలినీ
నా పాట వినకుమా! నా మాట వినకూ!

ఆకాశమార్గాన యలరేటి తారకను
గమ్య మది లేని యా కమనీయ మేఘమును!

ఊహలకు అందనీ యున్మత్తు రాలినీ
నా పాట వినకుమా! నా మాట వినకూ!

అందాల జాబిలిని యాటలాడుదు నెపుడు
తారకలతో గూడి దగ మాట లాడుదును!
కోకిలలతో గూడి కుహూ కుహూ రాగాల
పాటబాడుచు నెపుడు బరవశము జెందుచును ॥ఊహలకు॥

కొండ కోనలయందు గూడి దిరుగుచునుందు
మౌనముద్రను దాల్చి మాటాడకుండెదను!
సెలయేటి జాలులను జేరి పాటల విందు!
వనవీధులందు నే వగలు జిందుచు నుందు! ॥ఊహలకు॥

నా లోపలను నేను నవగీతి బాడుదును
మాటాడుకొందు నే మౌనముద్రను వీడి!
ఉన్నదానిని నేను దిన్నగా జూడకను
లేని దానిని గాంతు లీలగా భువియందు ॥ఊహలకు॥

ఆనందమును జెంది యలరుదును నాలోనె
కడు విషాదము నొంది కడలిలో మునుగుదును
విశ్రాంతి లేదుగద! విమల శాంతిని నంద
ఉన్మత్తురాలిగా జన్మ యిచ్చితి విటుల ॥ఊహలకు॥

## ఆందాల నా గీతి!

అందాల నా గీత
యాడిపాడును మదిని!
ఆపవోమూ మురళీ
అందాల ధ్వనులా! ॥అందాల॥

తీయనీ నాదాల
తేలియాడుచు గీతి;
రాజనర్తకి వోలె
నర్తించు వనవీధి! ॥అందాల॥

మురళి స్వరముల గలిసి
మోదమున నా గీతి!
కోకిలకువలె బాడు
కొసరి మంజులవాణి! ॥అందాల॥

అందాల మురళిలో
నైక్యమగు కోర్కెతో!
దీక్ష గైకొన్నట్టి
దివ్యసుందరి సుమా! ॥అందాల॥

స్వరములో స్వరముగా
నాదమున నాదముగ!
నా గీతి జేర్చికొను
నాథ బీ మురళిలో ॥అందాల॥

## వికసించిన పువ్వులాగు!

వికసించిన పువ్వులాగు
విస్పష్టం! సతిభావం!
పరిమళించి, పరవశించి
భక్తిమాల జేరుటకే! ॥వికసించిన॥

పరువులెత్తు ఏఱువలే
భావమదీ సుస్పష్టం!
కిన్నెర స్వరముల పాడీ
వన్నెలాని జేరుటకే! ॥వికసించిన॥

నృత్య మయూరికి వోలె
అది భరతం! అది నాట్యం!
నటరాజును మెప్పించీ
నాతి పతిని జేరుటకే! ॥వికసించిన॥

మంగళ గీతమును బోలె
మాధుర్యం మహనీయం!
మంగళమూర్తిని జేరీ
మమతను హృది నొందుటకే! ॥వికసించిన॥

కమనీయం కాంత కోర్కె!
మహనీయం! మనోహరం!
కాలను పీడి తపియించే
కలికి మీను సాక్షిగదా! ॥వికసించిన॥

## అందాల నా గీతి!

అందాల నా గీత
యాడిపాడును మదిని!
ఆపవోమూ మురళీ
అందాల ధ్వనులా! ॥అందాల॥

తీయనీ నాదాల
తేలియాడుచు గీతి;
రాజనర్తకి వోలె
నర్తించు వనవీధి! ॥అందాల॥

మురళి స్వరముల గలిసి
మోదమున నా గీతి!
కోకిలకువలె బాడు
కొసరి మంజులవాణి ! ॥అందాల॥

అందాల మురళిలో
నైక్యమగు కోర్కెతో!
దీక్ష గైకొన్నట్టి
దివ్యసుందరి సుమా ! ॥అందాల॥

స్వరములో స్వరముగా
నాదమున నాదముగ!
నా గీతి జేర్చికొను
నాథ చీ మురళిలో ॥అందాల॥

## విరహవేదన నాదు

విరహవేదన నాదు వేయి జలపాతాలు!
ఆపలేనిది స్వామి! యంతమే లేనిదీ!

పువ్వులో తేనెలా పౌలుపుగా తారలో
కాంతిలా చేర్చుకో! శాంతిగూర్చుము కృష్ణ!

విరహవేదన నాదు వేయి జలపాతాలు!
ఆపలేనిది స్వామి! యంతమే లేనిదీ!

వేయి సుడిగుండాల వేడుకను దిరుగుతూ
అతివేగమున నిన్ను నందుకొన కాంక్షా!
దరిలేని వాహినిని తరలిపోవుచునుంటి
అందుకొనవయ్యా! నీ యందాల మురళితో!

గిరి శిఖరముల పైని బిరబిరా ప్రవహించు
నది గలిసికొందు నెటు నయముగా కృష్ణా!
మబ్బులను గప్పికొని మాయమైనట్టి యా
కాంతిపుంజము నెటుల గాంచుదును కృష్ణా!

జంటచుక్కకు వోలె వెంటనుండెద నెపుడు
కంటిపాపకు వోలె కలిసి యుండెదనూ!
నీవు లేనీ బ్రతుకు నిర్జనంబగు నడవి
వెన్నెలా విరిసినటు వేడ్క నా బ్రతుకూ!

వేయి జలపాతాల వేగముగ కన్నీరు
జలజలా రాల్చుచును జరుగుచుంటిని భువిని!
నిను గలియగా గోరి నిప్పులను జెలగుచును
జ్వాలగా మారితిని జాగుసేయకు స్వామి!

## అల చిలుకవలె నీవు

అల చిలుకవలె నీవు నందగత్తెవు గావు!
వన్నెలే లేవనుచు చిన్ని మాటలతో!

చిన్నబుచ్చకు నన్ను శ్రీకృష్ణ! కోకిలను!
మధుర గీతికల నే మది బాడుకొనుచుదాన!

అల చిలుకవలె నీవు వందగత్తెవు గావు!
వన్నెలే లేవనుచు చిన్ని మాటలతో!

మాటలే రానట్టి మధుర గోపిక నేను
పాటలను బాడేటి పరమ శ్రీవైష్ణవిని!
అడవిలో అందాలు నలరిపెంచుదు నేను!
కోనలో మధురిమల కూర్మి నొలుకుదు కృష్ణ!

కూ యనుచు గోపాల! కూర్మి పాటలు బాడి
వనమంత జాగృతిని వన్నెలను నింపుదును!
మధురమగు రాగాల మనసులను ద్రవియించి
మేలుకొలుపుదు కృష్ణ! మేదురంబగు భక్తి!

వెన్నెలా దారాల చిన్నిపూవుల తోని
మాల గ్రుచ్చితినోయి మధురమగు భక్తితో
కైశికీ రాగాల కమ్మనీ గీతితో
పాటబాడుచు నుంటి! బరగ విను! గోపాల!

కొంప గూడూలేని కుదురు లేనట్టిదని
బైరాగి యని నన్ను భావించెదరు జనము!
నీ కొఱకు గద స్వామి! నిర్మలంబగు భక్తి
కొండ కోనల నిటుల కూర్మి దిరుగుచు నుంటి!

## ఎందుకో యీ రోజు

ఎందుకో యీ రోజు విందుగూర్చుచు మనసు
కందుచున్నది సఖీ! గగనాన పక్షిలా!

వన్నెలా కృష్ణుడూ వచ్చుచున్నా డనుచు
మదియందు దోచెనే మర్మముగ చెలియా!

ఎందుకో యీ రోజు విందుగూర్చుచు మనసు
కందుచున్నది చెలియ! గగనాన పక్షిలా!

నా వినతి మన్నించి నా గీతములను విని
నా హృదయ ప్రార్థనల నయముగా నాలించి!
ఒక్కొక్క యడుగునూ వరుస తోడుత వేసి
వచ్చుచున్నా డనుచు వనర మది దోచెనే!

అంతరిక్షమునందు నలరు కలహంసవలె
భువికి దిగుచుండెనవి పులకరించెను మనసు!
స్పందించుచుండెనే సఖియ నా హృదయమును
వెన్నెలలు విరిసెనే విమలమౌ గగనాన !

పాదముల సవ్వడియు బరగ వినబడుచుండె
దివ్యకాంతులు భువిని దీరుగా బడుచుండె!
అలరి నా హృదియందు అందాల ధ్వనులేవో!
శ్రుతిలయల దోడుతను చోద్యముగ వినబడెను!

తీయనీ హృదయాన దీరుగా జేర్చుకొన
భవబంధములనుండి బరువు దప్పించుటకు
నా కోర్కె దీర్చునని నా మదిని దోచెనే
అంతరంగము నందు ననిపించుచుండె చెలి!

## రాత్రంతా కలలతో

రాత్రంత కలలతో రమ్యముగ నిలిచేవు!
తీయనీ మురళితో తేనె లొలికించేవు!

ఉదయ సంధ్యల మఱల సదయ! నా హృదియందు
రాగమాలిక నొలికి రమ్యతను గూర్చేవు!

రాత్రంత కలలతో రమ్యముగ నిలిచేవు
రాగమాలిక నొలికి రమ్యతను గూర్చేవు!

విశ్వమంతా నీవు వేయి రూపాలతో
నిలిచియుందువుగదా నీరజాక్షా! నీవు!
కనుల యెయటను నిలిచి కాంక్షదీర్పవు గదా!
కఠినత్వమును జూప కాంక్ష మది యేమో!

విశ్వమంతా నీవు నిలిపెదవు నందముల
గగనమున నింపెదెవు కాంతి తారలనూ!
కన్నీళ్లు నింపుతూ కాంక్షతో నిను గోరు
గోపకన్నెను గావ కోప మది యేలా?

పాడుచుంటిని స్వామి! పారవశ్యము తోని
అతిచిన్న వయసునను నాటలాడుచునూ!
మదియందు నిలిచి మఱి మాటాడ వెందుకో
స్వీకరింపవుగదా! శ్రీకరముగా నన్ను?

అలసిపోతిని స్వామి! యలరి నిను బాడుచును
మోకరించుచునుంటి మోదమున గోపాల!
పాటలో నున్న యా పరమార్థమును గాంచి
ననుజాలి జూడుమా! నాథ! శ్రీ గోపాల!



# లలిత గీతాలు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ గ్రంథాలయ సంస్థవారి అనుమతి నందబడినవి.

(పుస్తకముల కన్నింటికి సైజేషను నలబర్లు గలవు)

| | | |
|---|---|---|
| 1) | విజయ మంగళం | 4-00 |
| 2) | ఆనంద మంగళం | 4-00 |
| 3) | పాలేటి తరగల్లో మల్లి | 6-00 |
| 4) | శ్రీరామచంద్రసుధ (కీర్తనలు) | 4-00 |
| 5) | కృష్ణదాసి | 4-00 |
| 6) | చిగురులు-పువ్వులు | 4-00 |
| 7] | హరిదాసి (గోదాదేవి పాటలు) | 2-00 |
| 8) | గిరిజా కల్యాణము (ద్విపదలో) | 10-00 |
| 9) | శ్రీగోదాదేవి పాటలు | 2-00 |
| 10) | పూలరథం [గేయములు) | 6-00 |
| 11) | మౌనగీతాలు | 6-00 |
| 12) | కన్నీటి పువ్వులు | 6-00 |
| 13] | శాంతిగీతం | 6-00 |
| 14) | మధుర గోపిక | 8-00 |
| 15) | మురళీస్వనాలు | 8-00 |
| 16) | పిల్లనగ్రోవి పిలుపులు | 8-00 |
| 17] | సుందరకాండము | 15-00 |
| 18) | శ్రీమురళి | 10-00 |
| 19) | దీపలేఖ (చదువు వెలుగు నాటిక) | 8-00 |
| 20) | వీధి దీపం (కవితలు) | 5-00 |

# రచయిత నూతన గ్రంథములు

డైరెక్టర్ ఆఫ్ హైద్రాబాదు వారిచే ది 25-10-99 న
జారీచేయబడిన సైటేషన్ నెంబర్ల జాబితాలోని

## మా స్వంత పుస్తకములు

| | | | |
|---|---|---|---|
| 1. | మంచుముత్యాలు | 771/సాతె 700/13754 | రు. 20-00 |
| 2. | శ్రీరామకథా సుధాలహరి | 970/సాతె 800/153 | రు. 20-00 |
| 3. | శ్రీ భగవద్గీత | 276/సాతె 200/101 | రు 20-00 |
| 4. | శ్రుతిలయలు | 1272/సాతె 800/455 | రు. 20-00 |

## 1999 లో నూతన ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. | కలబోసిన ముత్యాలు (1000 ఆటవెలది పద్యాలు) | రు 20-00 |
| 2. | ఆనంద యాత్ర (లలిత గీతాలు) | రు. 20-00 |
| 3. | విరహగీతం " | రు. 20-00 |
| 4. | ఆనంద గ్రంథి " | రు. 20-00 |

## వెలువడనున్న గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | హరిపూజ (శ్రీ ఆండాళ్ దేవి) | రు. 20-00 |
| 2. | శ్రీరామకథా సుధా లహరి (చతురస్ర గీతికలు) ఆయోధ్యకాండము (మొదటి భాగము) | రు. 20-00 |


రచయిత :

**పి. దుర్గారావు,**

యం. ఓ. యల్.

అడవిదేవులపల్లి (పోస్టు)
(వయా) మిర్యాలగూడ - నల్లగొండ జిల్లా - 508 207

## ఆర్ద్ర భావమునను వేడు

ఆర్ద్రభావమునను వేడు
ఆర్తినేల వినవాకో!

రాళ్ళుగూడ రోదనలను
రవలు జేయుచున్నవిగా!

ఆర్ద్రభావమునను వేడు
ఆర్తి నేల వినవాకో!

కరుణ నేలువాడ వనుచు
కారుణ్యపు మనసువనీ!
మనసు నిచ్చి మ్రొక్కుచుంటి
మన్నింపవుగా దయనూ! ॥ఆర్ద్రభావమున॥

చిందిన నా వేదనంత
చిఱుగాలుల మంటలాయె!
కన్నీటిని జూడు మదిగొ!
కలహంసల కొలకులాయె! ॥ఆర్ద్రభావమున॥

కొండలలో బండలవిగొ!
కొనలుచెదిరి రోదనలను!
అనుకరించుచుండె నన్ను
ఆర్ద్రభావ గీతికలను! ॥ఆర్ద్రభావమున॥

ఆత్మార్పణ జేసి నీకు
అంజలి ఘటియించు నన్ను!
కరుణబ్రోవ కెవరికినై
కారుణ్యము దాచితివో? ॥ఆర్ద్రభావమున॥